గౌరవ సంపాదకులు:

కవిరాజహంస, కవికులాలంకార

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

పునర్ముద్రణము:

వెల రు.0-12-0.

కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ. ఇ. జి. 19-1946-1000.

# ప్రథమఖండము.

## ౧

ఒకనాఁటి ప్రత్యూష కాలమున దేవేంద్రవిజయుఁడు పోలీసు స్టేషనుకు వచ్చి ఇనస్పెక్టరు రామకృష్ణ బాబును జూచెను. దేవేంద్రవిజయుఁ డొక్కఁడే, సుప్రసిద్ధుఁడు, సుదక్షుఁడు, శ్రేష్ఠుఁడు నగు నపరాధిరహస్యపరిశోధకుఁడు. అతని భయముచే పట్టణ మందనేక చోరులు తమచౌర్యములను మానుకొనిరి. దోపిడీకాండ్రనేకులు తమదోపిడీకార్యములకు నీళ్ళు వదలుకొనిరి. మోసగాండ్రనేకులు తమకపటకృత్యములను వదలిపెట్టవలసినవారైరి. వేయేల? స్వకృత్యములయం దవిధమగు వ్యాఘాతము సంఘటించుట చే నాకూ్రరులందఱును రేయింబవలు దేవేంద్రవిజయుని మరణమును గోరి త్రికరణశుద్ధిగాఁ దమయిష్టదేవతలకు మ్రొక్కుకొనుచుండిరి. అందఱును భయపడుచుండిరి; భయపడనిది గర్వితయగు నొక్క జమీలియా మాత్రమే! ఎంత ప్రార్థించిన నించుకంతయు సాహాయ్యము చేయఁజాలని యిష్టదేవతలఁ గొలుచుటవలన నేమి లాభమని యెంచి జమీలియా మాత్రము స్వహస్తములతోనే దేవేంద్రవిజయునిఁ జంపవలయు నను సాహసముతో నొకసారి వచ్చియు మరలఁ బ్రతికి బయటఁ బడియెను. ఆవిచార మామెహృదయమున నెలఁకొ

చుండెను. దేవేంద్రవిజయుఁడు బుద్ధిశాలియును, క్షమాశాలి యునై యుండెను. అట్లే కానిచో నామె కాతఁడు క్షుద్రపిపీలికాసదృశుఁడై యుండును. అప్పు డామె యాతని దనపదతలముల ద్రొక్కివైచి మనఃక్రోధమును దీర్చుకొనియే యుండును. అట్లు సాగినది కాదు. ఎట్లును ఎప్పుడును నాతఁడే యామె దర్పము నణంచివైచుచుండెను. ఇది యంతయు భావించుచు జమీలియా మాటిమాటికి నాశాభపాటు నందుచుండెను.

ఎప్పుడు దేవేంద్రవిజయుఁడు రామకృష్ణబాబునొద్దకు వచ్చెనో, యప్పు డాతఁడు నిశ్చింతభావముతోఁ చలువగొట్టముపైనున్న యొకచిన్నచుట్టను బన్నులతో గట్టిగఁ గఱచిపట్టి ధూమపానముఁ జేయుచుండెను. అట్లే పరమనిశ్చింతభావము తోఁ, దెఱచియున్న గవాక్షద్వారమునఁ జుట్టలు చుట్టుకొని వెలుపలకుఁ బోవుచున్న యాధూమమును జూచుచుండెను. అంకట ప్రాతఃకాలముననే దేవేంద్రవిజయుఁ డాకస్మికముగా నచ్చటికి వచ్చుచుండుటను జూచి యాతఁ డించుక విస్మితుఁ డయ్యెను. సవ్యాసముతో నాతనిఁ దనపార్శ్వమునం దున్న కుర్చీపైఁ గూర్చుండఁ బెట్టుకొని "బాబూ! ఏమి సమాచారము? ఏమి కథ? ఏదియో విశేష ముండియుండును!" అనియెను.

"వ్యాపారము చాల నాశ్చర్యకరమైనది. ఇది యలౌకిక వ్యాపారమే. ఇట్టివిచిత్రము నిదివఱ కెవ్వరును గని విని యుండరు."

" ఈసంఘటన మంతటి యాశ్చర్యకర మైనదియా ?"

" అత్యలౌకిక మైనది. ఈభౌతికవ్యాపారమును గూర్చి విన్నచో మీరుగూడ నాశ్చర్యమున మునిఁగిపోవుదురు !"

" సెబాస్ ! నేనుగూడ విస్మితుఁడ నగుదునా ? చూతముఁ ! పదిసంవత్సరముల యీనడుమ సాధారణముగా నేనొక్కమారైన విస్మితుఁడ నైతినో లేదో చెప్పఁజాలను. నే నాశ్చర్యపడవలసివచ్చినచో నీసంఘటనము చాలఁ గ్రొత్తదియే కావలయును."

"ఫూల్ సాహెబువిషయము మీ కుజ్ఞప్తియందున్నదా ?"

" అది విలక్షణమైనదియే ! విచిత్ర మైనదియే !"

" చాలదినములవఱకును మాయామనోరమ మైయుండి లేనకటాధికారమును బ్రదర్శించుచుఁ దుదకు "హజరత్ బంగాళాయం" దాత్మహత్యగావించుకొనిన జమీలియా మీకు జ్ఞప్తియం దున్నదా ?"

" ఆహా ! అది పిశాచి యైనదా యేమి ?"

" నిజముగా నామెయే పిశాచి."

" ఆమె యేమి యైనది ?"

" ఆమె మరణవృత్తాంతము మీ స్మరణయం దున్నదా ?"

" బాగుగ నున్నది."

" ఎంతవఱకు జమీలియాదేహము గోరియందుఁ బెట్టలేదో, యంతవఱకు నే నాకళేబరమును జాగరూకతతోఁ గాచు

చుండుటను గాంచి మీరును కాళీఘాటుస్టేషను ఇనస్పెక్టరు ను నన్ను హాస్యము చేసితిరి. అది యిప్పుడు జ్ఞప్తి యుందున్నదా?"

"గోరీయందు బెట్టునపుడే గాదు; సంపూర్ణముగా మన్ని గప్పుచుండునపు మీదృష్టి సమభావముతో దానిమీఁదనే యుండెను. జేవేంద్రబాబూ! ఆసంగతి జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల నవ్వువచ్చుచుండును." అని యాతఁడు నవ్వసాగెను.

"నేనట్లు చూచుట వ్యర్థము కాలేదు. నేను భావించినట్లే జరిగినది. అప్పుడు నేను ముఖ్యముగా నొకదూరము యోచింపవలయునో యంతదూరము యోచింపలేదు. ఇంకను గొంతకాల మాగోరీపై విశేషదృష్టి నుంచి యున్నచో బాగుగ నుండెడిది."

"సరియే విశేష మేమియో చెప్పుఁడు. మీముఖము వ్యక్తోత్సాహభావముతో నగపడుచున్నది. గోరీపై మనుష్యుని కాపుంచితిరా?"

"ఔను. వారముమాత్రమే యుంచితిని."

"ఎప్పుడైతే మరణించినదో ఎప్పుడైతే నైదుమూరల లోతు గలగోరీలోఁ బాతిపెట్టితిరో, అట్టిదానిపైకై మీ రొకవారము కా పుంచితిరా? ఇప్పుడును మాటిమాటికి నింకను గొంతకాలము కా పుంచినచో బాగుగ నుండు నని చెప్పుచున్నారా? ఈమాటల కర్థ మేమున్నది? మంటిలోఁ బూడ్చిన వా రప్పు

లైన వారము వఱకు బ్రతికియుండుట కలదా ? ఇది నాబుద్ధి కసాధ్యముగా నున్నది."

"ఇది యసత్య మని చెప్పఁబోను. ఈవిషయమున సాధారణజను లైనచో జీవించుట యసంభావము."

"దేవేంద్రబాబూ ! మృత్యువునకు సాధారణ మేమి, అసాధారణ మేమి ?"

"అరబ్బీదేశపు ఫకీరులు గోరిలను ద్రవ్వి శవములను జీవములు వచ్చునట్లు చేయుచున్న సంగతి నెప్పుడును వినలేదా?"

"అనేక సమయములం దనేక పర్యాయములు విని యున్నాఁడను"

"వా రేమి చేయుదురో యెఱుఁగుదురా ?"

"ఆహా ! కొంచెముగా —"

౨

దేవేంద్రవిజయుఁడు చెప్ప నారంభించెను. "అరబ్బీ దేశపు ఫకీరులు మూలికల మూలమున నట్టి విచిత్ర కార్యము లనేకములు చేసియున్నారు. గొప్పగొప్పపరీక్షలు నిచ్చిన డాక్టరులుగూడ వానిమర్మమును గ్రహింపఁ జాలకపోయిరి. ఇట్లుండఁగా నొకనాఁ డందఱుఁ జూచుచుండఁగ ఫకీరు నొకనిని సమాధి చేయించిరి. ఫకీరును సమాధిలో నుంచినదినము మొదలుకొని యొక నెలవఱకు నాగోరిపై నడతెగకుండ నొకక న్నుంచి శిరమయు సని స్థిరపఱచుకొని యాస్థలమునం దొక్కని గావలి

పెట్టిరి. ఒకరాత్రి యాసమాధినుండి యాఫకీరు నెవ్వరో వైకిఁ దీసిరి. పరక్షణముననే ఫకీరుమృతదేహమునఁ జైతన్యోదయ మైనచిహ్నము లగపడియెను. పిమ్మట నాతఁడు తినుట, కూర్చుండుట, మాటలాడుట, స్వేచ్ఛగా నిచ్చటినుండి యచ్చటికి దిరుగుట మొదలగునవి చేయఁగలవాఁ డయ్యెను. ఒకచిన్న మాట. అతఁడు మునుపటివలెనే బలిష్ఠశరీరుఁడై వెలిపోయెను."

రామకృష్ణుఁడు నవ్వుచు "చెప్పెడివాఁడు పిచ్చివాఁడైనచో వినెడివానికైన వివేక ముండవలదా?" అనియెను.

"నేను పిచ్చివాఁడ ననియేనా మీయూహ ?"

"కాదు."

"మీకు నమ్మక ముండక పోవచ్చును. నేను కన్నులార నట్టిసంఘటనముల నెన్నిటినో చూచితిని. అందువలన నట్లు జరుగుట సహజ మనియే నమ్ముచున్నాను."

"బాగు! ఇన్నిమాట లెందుకు? చెప్పుఁడు! మీగార చంద్రిక ఆ జూమల మరల నుద్భవించినదా యేమి?"

"డాక్టరు ఫూల్‌సాహేబు చాలదినము లారబ్బదేశమునం దుండెను. తరువాత కామరూపదేశ మంతయుఁ దిరిగెను. అతఁ డనేకమూలికలను మంత్రములను దెలిసికొనెయెను. అతని సామర్థ్య మసాధారణ మైనదియే."

"ఔను. ఆసామర్థ్య మంతయు నాతఁ డందఱకును జూపించియే మరణించినాఁడు."

"జమల యాతని శిష్యురాలు. శిష్యురాలుమాత్రమే కాదు ప్రియురాలుకూడను."

"ఎఱుఁగుదును. జమల సాధారణస్త్రీ కాదు."

"గురునిచాతుర్యముకంటెను శిష్యురాలి చాతుర్యమే హెచ్చైనది."

"ఐ యుండవచ్చును. ఇప్పుడు జరిగిన దేమి!"

"ఆ జమల అనాకపిశాచి ఇంకను మరణింపలేదు."

రామకృష్ణుఁడు విస్మయముతో "ఎంతటి యాశ్చర్యము! అది యెట్లు? చెప్పుఁడు!" అనియెను.

"నేనావిషయమును గూర్చియే మీకుఁ జెప్పుటకు వచ్చితిని. ఆమె బ్రతికియున్న పక్షమున శీఘ్రముగనే మీకుఁ దగిన నిదర్శనములు దొరకును. ఆమె సాధారణస్త్రీ కాదు. తనచేతులార లెక్కలేని నరయజ్ఞములను జేసియున్నది. గోరిని త్రవ్వి చూచినచో నామె మరణించినదియు బ్రదికియున్నదియు రూఢిగఁ దెలియవచ్చును. తెలిసికొనుట కదితక్క వేఱుపాయము లేదు."

"ఆమెను పాతిపెట్టి యెన్నిదినములైనది?"

"నేటిసాయంకాలమున కిరువదినాలుగు దినములు."

"ఇన్నాళ్లు గోరిలో నున్నమృతదేహమును బైకిఁదీయుటకు సాధ్యమగునా? మీరు దీనినిగూర్చి బాగుగ నాలోచించితిరా?"

"మృతదేహము మీ కెక్కడ దొరకును? గోరీయందు నేమియును లేదు. చూడుఁడు!"

"ఈభ్రాంతి మీ కింకను వదల లేదు."

"అగును."

"దేవేంద్రబాబూ! వ్యాపార మేదియో చెప్పుఁడు చూతము!"

"శ్రీశచంద్రుఁ డనుచతురమతి యగునొకబాలకుఁడు వారియొద్ద నపరాధరహస్యపరిశోధనవిద్య నభ్యసించుచున్నాఁడు. 17. క." పులిందారసేరమునం దాతఁడు వారికి మిగుల సాహాయ్యము చేసియున్నాఁడు. ఏశ్మశానమార్గమునందు జమలగోరీ యుండెనో, ఆశ్మశానమార్గమున శ్రీశచంద్రుఁ డొకచోటికిఁ బోవుచుండెను. పోవుచు జమలగోరీ నొకసారి చూడవలయునని దానిని సమీపించెను. జమల యాతని మహావిపదంధకారమునఁ ద్రోసియుండుటచే నాతఁ డెన్నటికిని జమలను మఱవఁ జాలఁడు. వయసున నంత పెద్దవాఁడు కాకపోయినను శ్రీశుఁడు బుద్ధిసంపత్తునఁ జాలఁ బెద్దవాఁడు. అతనిదృష్టి మిగులఁ దీక్ష్ణమైనది. జమలగోరీమీఁద నున్న మన్ను త్రవ్వియుండుట జూచి యాతనిమనసున నొకవిధ మగుసందేహము కలిగెను.

పిమ్మట నాతఁ డొకకొన్ని కాగితపుముక్క లక్కడఁ బడియుండుట జూచెను. ఒకముక్కమీఁద జమలపేరు వ్రాసియుండెను. అందువలన నాతని సందేహ మఱింత బల

మయ్యెను. అతఁడు కాగితపుముక్కల నన్నిటిని వెనక నారంభించెను. ఈవిధముగనే చిన్నచిన్నకాగితపుముక్కలు నాలుగువైపులకును నెగిరి పోయియుండుటను జూచెను. అదినమంతయు నాతఁ డా కాగితపుముక్కలనే విశేషముగా సంగ్రహించుకొని యింటికి వచ్చియుండెను. అతఁడు నాకుఁగూడ నావిషయమును దెలియఁజేయ లేదు. తానే చినిఁగిపోయినముక్కల నన్నిటిని క్రమముగా నొక్కచోటికిఁ జేర్చి జిగురుతో మఱియొక కాగితముపై నంటించెను. ఇది విశ్వసింపఁదగినది."

"శ్రీశుఁడే యీ కాగితపుముక్కల నన్నిటిని సరిగ నంటించుటకు సమర్థుఁడయ్యెనా?"

"అవును."

"కాదా? అతఁ డెంతటివాని శిష్యుఁడు! తరువాత!"

"అతఁడు నిన్నటిరాత్రి యాపత్రమును దెచ్చి నాచేతి కిచ్చెను. అత్యాశ్చర్యకర మగునట్టి పత్రమును నేనెవ్వఁడును జూచియుండ లేదు."

"ఎంతటి యాశ్చర్యము! నేను దానిని జూడవచ్చునా?"

"నాయొద్దనే యున్నది. శ్రీశుఁ డాపత్రమును జదువుటకనుకూలముగాఁ జేసియే నా కిచ్చియున్నాఁడు! ఆపత్రమునకు మొదటివి రెండుమూఁడు శకలములును, నడుమ నొకటి రెండు ముక్కలును దొరకకుండఁ బోయినవి. శ్రీశుఁడు స్వయము

ముగ నా పత్రిఖండము లను భరిగాఁ జేర్చియున్నాఁడు. చూఁడుఁడు!"
అని దేవేంద్రవిజయుఁ డాయుత్తరము నాతని చేతి కిచ్చెను.

## 3

ఆయుత్తరమునం దిట్లున్నది:

"——వలను గాలేదు. ఆలసించుటకు సమయము కాదు. బ్రదికియున్నచోఁ జేసెదను. ఏమి చేయుదును? దౌర్భాగ్యవశమున నిన్నుఁ జూచుట కవకాశము కలిగినది కాదు. విశేషకాష్టమునకై బాలీగంజివైపునకు బయలుదేరి పోవుచున్నాను. అక్కడ నేను బదుకను దొరకిపోవచ్చును! అట్లు జట్టువడుటయే తటస్థించినచో నేను నీతోఁ జెప్పినట్లుగనే యాత్మహత్య చేసికొందును. నేను మరణించిన దినము మొదలుకొని మూఁడవ దినములవఱకు గోరీమధ్యమున జీవించియే యుందును. ఇష్టమున్నచో నీవు నన్నుద్ధరింపవచ్చును. నిర్దిష్టసమయమునకు ముందుగ వచ్చి యొకరాత్రి నీ ప్రయత్నము చేయవలయును. నిర్దిష్టసమయమున కొకరాత్రి దాఁటిపోయినచో నీ వా ప్రయత్నమును జేయనక్కఱ లేదు. అట్టి ప్రయత్నము విఫలమై పోవును.

గోరినుండి నన్నుఁ బయటికిఁ దీసి చూచినచోఁ బన్నులు గిట్టకఱచుకొనిపోయి యుందును. అప్పుడు నీవు ప్రయత్నపూర్వకముగా నానోటిని దెఱచుము. పిమ్మట నీసీసాలో మాయాపధము నైదారుచుక్కలు నానోటఁ బోయవలయును.

ఈయెనిమిదిచుక్కలకంటె నొకచుక్కయైన హెచ్చుగఁ బడనీయకుము! జాగ్రత్త! పిమ్మటఁ జేయవలసిన దేమియును లేదు. ఆఱుగంటలవఱకును గనిపెట్టుకొని యుండవలయును.

నీవు నాయీయాటంకముల నన్నిటిని దప్పింపఁగలిగినచో నన్నుద్ధరింపఁ గలిగినచో ఆఱుగంటలకుఁ దరువాత నేను నీతో మాటాడుదును. నాప్రాణములు నీవలన నిలిచిన పని చెప్పెదను. ఇంత యెందులకు? నేను నీభార్యనైనచో మొదటినుండియును జేసిన యసంఖ్యాకములగు నాపాపములను నీవు మఱచిపోవలయును. నీవు మఱచిపోవునట్లు నేను జేసికొనఁగలను. బ్రదికించుకొనుము. రక్షింపుము. నేను నీదాననే యయ్యెదను. పూర్ణిమనాఁటి కిరువదితొమ్మిదిదినములు జ్ఞప్తియుంచుకొనుము. తరువాత నొకగడియ మీఱిపోయినను, మితితప్పినవెనుక నన్ను బ్రదికింపఁజాలవు. నేను మరణించెదను. నాకుఁ బ్రాణదానము చేయుము. నా యీప్రాణము నీవు బ్రదికించుకొనెడి యీప్రాణము చిరకాలము నీయధీనమునందే యుండును.

నీప్రేమాకాంక్షిణి,

జమల.

౪

రామకృష్ణుఁడత్యాశ్చర్యముతో నిట్లనియెను! "ఇదేమియాశ్చర్యము! దేవేంద్రబాబూ! జమల నిజముగా గోరినుండి లేచిపోయినదో యుండు ననుకొనియెదను!"

"నాకు నదియే నమ్మకము."

"ఎప్పుడైన నట్లు జరిగియుండునా?"

"జరగ కేమి? జరిగినది కాదా!"

"శ్రీశచంద్రుఁడు గొప్పపొరపాటు చేసినాఁడు. ఎవ్వరి పేర నీయుత్తరము వ్రాసినదో వారిపేరు గలకాగితమునే యతఁడు వెదక మఱచినాఁడు. ఇదియే గొప్పవిషయము. ఆకాగితపుముక్కలనుగూడ వెదకి తెచ్చినచో బాగుగ నుండును."

"వెదకినను దొరకలేదు. రామకృష్ణబాబూ! ఇప్పుడొకమాట చెప్పవలసి యున్నది."

"ఏమి?"

"రండు! ముందుగ మనము జామలగోరీని దర్శించి సంగతిసందర్భములను గనిపెట్టుదము. అప్పుడు సత్యాసత్యములు బయలుపడును. తరువాత మనము వానినిగూర్చి మాటాడుకొనవచ్చును."

"మంచిది. నేను సిద్ధముగనే యున్నాఁడను."

"నేఁటిసాయంకాలమా?"

"అట్లే కావచ్చును."

"రెండుగంటలకు వచ్చినచో నిక్కడఁ గాని, యక్కడఁ గాని నన్ను మీరు చూడవచ్చును."

"మీరే రెండుగంటలకు సరిగ నిక్కడకు రావలయును. వచ్చునప్పుడు గంగాధరునిగూడఁ దీసికొని రావలయును. అమా-

ర్గమునఁ బోవుచు సూపరింటెండెంటును బండిలోఁ గూర్చుండఁ బెట్టుకొని రావలయును. పిమ్మట నందఱమును జేరి జమలిగోరి యొద్దకుఁ బోవుదము."

"నేను నాగుఱ్ఱపుబండిని దీసికొని వచ్చెదను. అందుల కై మీరు కనిపెట్టుకొని యుండ నక్కఱ లేదు. నేను సరియైన వేళకే వచ్చెదను. శ్రీశచంద్రునిగూడఁ దీసికొని వచ్చెదను. మీ రీలోపల సరియైన కట్టుదిట్టములను జేసియుంచుఁడు."

"నే నిక్కడిపను లన్నిటిని నెఱవేర్చెదను."

"నామాట జ్ఞప్తియం దుంచుఁడు. నిశ్చయముగా గోరి యందు శవము దొరకదు. చూతురు గాని— చూచి తరువాతి ప్రయత్నములను జేసికొనవచ్చును."

"మంచిది. దేవేంద్రబాబూ! చూచుటకుఁ బోవుదము"

"జమలి తనమరణానంతరమునఁగూడ నన్ను వెంటా డింతు నని భయపెట్టుచుండెడిది. ఈవిషయమును మీ కెన్నఁ డును నేను చెప్పలేదా ?"

"లేదు."

"ఆమెగోరిమీఁద కన్నెంచి దొట్లు చేయుట కిది యొ క్కటియే కారణము. నే నిప్పు డామెభయప్రదర్శనమునకుఁ గారణమును దెలిసికొంటిని. ఆమె నాతోఁ జెప్పినట్లే చేసినది."

"నేను మరణించినపిమ్మటఁ గూడ నా సంకల్పము లన్ని యును నెఱవేర్చుకొందును. అట్లు చేయనిచో నాపేరు జమలి కాదు అని చెప్పినదఁట."

"మొదట మీ మనస్సున కిది స్ఫురింపలేదా? ఇప్పు డాలోచించి యామె యభిప్రాయములను, ఆమె చెప్పినమాటలను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచున్నారా?"

×

రెండుగంటలకు సరిగా వెనుకఁ జెప్పిన స్టేషను కెదురుగ నొకబండి వచ్చి నిలిచెను. దానిలో దేవేంద్రవిజయుఁడును వానిమేనల్లుఁ డగు శ్రీశచంద్రుఁడును గూర్చుండి యుండిరి. అప్పుడు రామకృష్ణబాబు సామాన్యవేషముతోడను, గంగాధరబాబు (మఱియొక ఇన్స్పెక్టరు) పోలీసువారి యూనిఫారము దుస్తులతోడను వచ్చి దేవేంద్రవిజయునిబండిలోఁ గూర్చుండిరి. బండివాఁడు బండిని నడిపింప నారంభించెను. బండి వచ్చి సూపరెంటెండెంటుగారి యింటి కెదురుగ నిలిచెను. సూపరెంటెండెంటుకూడ వచ్చి బండిలోఁ గూర్చుండె నని వేఱుగఁ జెప్పవలయునా?

యథాసమయమున కందఱును సమాధిక్షేత్రమునకు వచ్చి శ్రీహూవరాణిని యొఁజామమున పూడ్చిపెట్టిన స్థలమునకుఁ బోయి నిలిచిరి. అక్కడ నిరువురుకూలివాండ్రు గడ్డపార మొదలగు సాధనములతో నిలిచియుండిరి. సూపరెంటెండెంటు ఆజ్ఞ యిచ్చినతోడనే వారు జామలగోరీని త్రవ్వ నారంభించిరి.

గోరీనుండి శవపుఁబెట్టెను బైకిఁదీసి దానిమూఁతను దెఱచినతోడనే యేదియో విశేషము జూడవచ్చునని వారు తలంచి

చుచుండిరి. అందుకొఱకే యామున్సిఫు పోలీసువారును, ఆయా రేప్ర రపరాధపరాన్వేషణశోధనములను జేయించుచుండిరి. కొంతసే పైనపెట్టెట శవముపెట్టెను గోరీనుండి మీదికిఁ దీసిరి. ఆపేటిక చాల బరువుగా నుండెను. అందువలన నక్కడ నున్న వా రందఱును "పేటిక పట్టిన గాదు. జుమలిదేహ ముండియే తీరవలయును." అని యనుకొనిరి. దేవేంద్రవిజయుఁడు తన కక్కడ నవమానము కలుగునో యని చింతించుచుండెను

రాజకృష్ణబాబు దేవేంద్రునిపై పునఃఁ దిరిగి పరిహాసద్యోతకముగ భ్రూభంగము జేయుచు నవ్వ నారంభించెను. దేవేంద్రవిజయుఁ డసమానముతోడనే రహస్యభావమును గూర్చి యోచించుచు నంతులను గ్రహించుచుండెను. పరక్షణముననే శవపేటికాద్వారము తెఱచిరి. అప్పుడు దేవేంద్రవిజయుని మ్లానవదనము ప్రఫుల్లమయ్యెను. ఒకవిధ మగు విస్మయసూచకశబ్దము పెల్లరికంఠములనుండియు బయలువెడలెను. అందఱును చకితహృదయులై విస్మయవిస్ఫారితనేత్రములతో నా శవపేటికపై పునకే చూడసాగిరి. వారు పెట్టెయందు శవమునే చూచుచుండిరి కాని, అశ వెవ్వరిదో! జుమలిది కాదు. స్త్రీశవమే కాదు. పురుషశవము. గొప్పవారి యువకులవంటి యుడుపులను ధరించిన సుందరయువకునిది.

దేవేంద్రవిజయుఁడుతక్క మిగిలినవా రందఱును, స్తంభితులును, విలుప్తచైతన్యులునై పోయిరి. చాలసే పయిన

తాళపుఁజెవులగుత్తియు, నిజనవిరూపాయల నోట్లును, నాలుగు రూపాయలును, రెండు పావులాలును, మూఁడణాలును, రెండు కానులు నుండెను. మఱియొకవైపున సగ్గిపెట్టెయు, చుట్టయు, చిన్నపిస్తోలును, గొన్నియుత్తరములు మాత్రము నుండెను. ఆయుత్తరము లన్నియు నేరశోధనమునుఁ గూర్చి వ్రాసినవియే. వానిపై విలాసములను బరికించి చూడఁగా "షేక్ కబిరుద్దీన్, ఖిదర్పూర్, పేశ్వాబాటిక" నెం... లేన్, అని వ్రాసియుండెను.

అపత్త్రికపేరును గూర్చియు, నివాసస్థలాదులను గూర్చియు నెవ్వరికి సందేహము గలుగ లేదు.

దేవేం : రామకృష్ణబాబు! నేను జాముల నెక్కడఁ బట్టుకొనవచ్చునో యను మాటను బట్టియే నిశ్చయించితిని.

రామ : వస్థముసం దని తలంచెదరు ?

దేవేం : కబిరుద్దీనింటియందు ఖిదరపురమునందే ఖోజాబీబీగృహ మున్నది. ఇప్పుడు వ్యాపార మెంతవఱకు వచ్చినదో తెలిసికొంటిరా ?

రామ : లేదు. ఆశ్చర్యభరితముగా నున్నది. ఆవిభ్రాంతిచే నాబుద్ధియే భ్రమసిపోయినది.

దేవేం : ఇప్పుడు జాముల యన నేమో బాగుగఁ దెలిసికొంటిరి గదా ! ఇట్టి యద్భుతస్త్రీ నెప్పుడైన నెక్కడనైనఁ జూచితిరా !

రామ : లేదు. మొదట నాకు మీమాటలయందు నమ్మకము కలుగ లేదు. దేవేంద్రబాబూ! మీరుకూడ నావలెను స్వప్నముల గాదు విశేషముగనే ఘనాపదలఁ గంటిరి గాదా?

దేవేం : నే నామె విభ్రమములు వంచనలు, కపటనటనముల నంతయు నాంతరికముగ ముందు బాగ చూడఁగనై యుంటిని. నా భార్యయై నామె మిగుల బాగ బూని యున్నది. అది నిశ్చయముగ నేదో విపత్తునకే యని నాకుఁ దోఁచుచున్నది. అనవ సంకల్ప మూరక పోవునది కాదు. కానిండు! నే నంతటను భయపడను. భయశబ్దము నా జన్మచరిత్రమున వ్రాయ లేదు.

రామ : ఇప్పుడు మీ రేమి చేసెదరు?

దేవేం : ఆమెను వెదకుటకై పోయెదను.

రామ : ఆమెను పట్టుకొనఁగలరా?

దేవేం : ఆమెను బట్టుకొనఁజాలకున్నచో నా జన్మమే వ్యర్థమని తెలిసికొందును.

౬

మఱునాఁడు దేవేంద్రవిజయుఁడు పదిగంటల సమయమున వృద్ధమునసల్మాను వేషముతో వేశ్యావాటికయందున్న హరోబాబీబీగృహమునకుఁ బోయెను. అతని చేత క్యాన్వాసు గడ్డ సంచి యుండెను.

తలుపు రెండుసారులు కొట్టఁగనే సుందరి యొక్కతె ద్వారమును దెఱచెను. ఆమె యిరువదియేండ్లు, లేక, ఇరు

"ఇంతలో నిచ్చట నన్నాళ్లుండవలయు నని వెడలిపోయి నదెక్కడికో పోవుచున్నది! ఏమో యెట్లు తెలియును? ఆమెయున్నకబీరింటిలోనే తిరిగి యిచ్చటకు రాదట! ఆమె వ్రాసినసంగతి యిది! అక్క," చెప్పుము ఖరోజా దేవేంద్రుని మొగమువంకఁ జూచుచు నిలువఁబడియెను.

జేవే : ఎక్కడకుఁ బోయినది? నీయుత్తరములో నేమైన వ్రాసినదా?

ఖ : లేదు—ఏమియును వ్రాయలేదు! నీయుత్తరమునం దేమైన వ్రాసినదా?

జే : ఏమియును వ్రాయలేదు.

ఖ : ఆమెమనసులో నేమున్నదియో! ఎవ్వరికిఁ దెలియును!

దే : నాభయము చేతనే వారట్లు పారిపోయియుందురు!

ఖ : ఏమి? నీవనిన వారి కింతభయ మేమి?

దే : ఉన్నది. కబీరు చాలఁ జెడ్డపని చేసినాఁడు!

ఖ : ఏమిచేసినాఁడు? ఎట్టిపని?

దే : అతఁ డెప్పుడు నేదో యాలోచించుకొనుచుఁ బరధ్యానముతో నుండుట లేదా?

ఖ : ఔను. అట్లే యున్నాఁడు.

దే : అతని మొగము వాఁడిపోయి శుష్కించి మామిడి టెంకవలె నుండుట లేదా?

అతని కళంకమునుండి విముక్తునిగఁ జేయుదును. అందుకొఱకే—అతని నీనిశత్రువునుండి తప్పించుటకొఱకే నాఁటనుండియు నానోపా-యములను గూడఁ దీసికొని వచ్చితిని. అతనికిప్పుడీ సామ్రాజ్య మిచ్చి యాకష్టమునుండి తప్పించినచో నికముందైన నాతఁ డిట్టి దుష్కార్యములను మాని బుద్ధితెచ్చుకొనునేమో యని నా యాశ!

ఖ : మీరు మిగుల దయార్ద్రహృదయులు; సదాచారసంపన్నులు!

దే : ఎంతదయ యున్న నేమి లాభము! ప్రాణముతో నాదయను భావించునా? మన్నన గాంచునా? నా కాతని కొలుపు కలదా? నేనాతని జ్ఞప్తియందైన నుంటినా? కృతఘ్నుఁడు! కృతఘ్నుఁడు! దుర్మార్గుఁడు! నేనాతని కింతగాఁ బ్రేమించుచుంటినని యాతఁ డిప్పటికిఁ గ్రహించుటయే లేదు. అదియే నాకుఁ జాలవిచారకరముగ నున్నది-పోనిమ్ము. ఏమైనను సరియే. కాని—నీవింతకు దయయుంచి—

ఖ : ఎంతమాట! దయ యుంచుట యేమి!

దే : ఆతఁడుగాని యాతని సోదరుఁగాని మరల నిప్పటికైన నిచ్చటికి రాకమానరుగదా!

ఖ : ఏమో! వచ్చెదరని నాకు నమ్మకము లేదు.

దే : పోనిమ్ము! నీవు జాబైనను వ్రాయుదువా?

ఖ : వ్రాసిన వ్రాయవచ్చును.

దే : ఔను. వ్రాయకపోరు.

ముగ నిన్ను విడిచించుచున్నాను. ఇంతపర్యంతము నే నొక దానివలెక నొక్కటిగ నొక్కొక్క కార్యములు నెఱిగించుకొం చుచుంటిని. ఇఁక నీసారి నీకు వ్యతిరేకముగ, భయంకరముగ నేఁ జేయవలసిన ప్రయత్నము లన్నియు సంపూర్ణముగను, శీఘ్ర ముగను జేసి వైచుటకు సంసిద్ధురాల నై యున్నాను.

నీ వెంతమాత్రమును జూడఁజాలవు. వినజాలవు. తెలిసికొనఁజాలవు. ఆకస్మికముగ నేను నిన్నుఁ గరాళమృత్యు వదనమునకుఁ గబళముగాఁ జేసి వైచెదను. జాగ్రత్త! ఈయుత్త రముం జూచిన యుత్తరక్షణముననే నేను నిన్నెంతగా ద్వేషిం చుచుంటినో నీకు బాగుగ బోధపడఁగలదు. నే నెంతటిదాన నో నీవు తెలిసికొనగలుగుదువు!

అంధకారాంతరాళమున నే నాలోచించుకొంటిని. రహ స్యముగఁ గార్యమును నెఱవేర్చుకొనవచ్చునని తలంచితిని. కాని యట్లు జరిగినది కాదు. నే నిప్పుడు జీవించియే యుంటిని. ఈసంగతి నీకును దెలిసియేయున్నది. తెలిసికొనుము! నా కంత మాత్రమున నష్టమేమున్నది? భయపడుటకు నేను బాలికను గాను. భయపడుచున్న బాలికను గరుణతో నెత్తుకొనునంతటి దుర్బలహృదయను గాను. ఇది జమీలియా! జమీలియా నిన్ను నీదేహముతో సప్తసముద్రములను ముంచి సర్వనదీజల ములను దాఁటించి తీసికొని రాఁగలదు!! ఓ యపరాధపరిశోధ కాధ్యక్షా! అందుచేతనే సమానమగు శక్తి నీకున్నది

అద్భుతశక్తి. బాగుగ నాలోచించి జాగరూకతతోఁ బనిచేయఁ గలవు! అయినను నీ వేమి చేయుదువు? నీ భార్యనెన్నఁడుట విధవాయోగము లిఖింపబడియున్నది!

జామల నీచెవులఁ బట్టికొని యూఁచు పనియు, నిన్ను మూఁకుక్రిప్పలఁ బెట్టి మాడుచెరువులనీళ్ళను ద్రాగించు పనియు క్షేపియుంచుకొనుము! నీ విఁక దప్పించుకొనఁజాలవు! ఇఁక నాన్నాళ్ళో నీయాటలు సాగవు! నీకు మరణ మాసన్నమై యున్నది! ఇఁక యమపురమున నపరాధపరిశోధకుఁడవు కాఁగలవు! జమీలియాతో ద్వేషించి ప్రాణములతో నున్నవా రెవ్వరైన నున్నారా? మరణశాసన మేమైన వ్రాసికొనదలఁచినచో సత్వరముగ వ్రాసికొనుము! ఇఁక నీపేరు చిత్రగుప్తునికట్టికలోఁ జేరుటకు సిద్ధముగా నున్నది!

ఇదివఱకు నీవును నీమిత్రులును వచ్చి నాగోరీని ద్రవ్య పరీక్షించుచున్న సమయమునకే యాకస్మికముగ నే నచ్చటికి వచ్చితిని. రహస్యముగఁ జెట్టుచాటున నిలిచియుండి మీచర్యల నన్నిటిని జూచితిని. మీమాటల నన్నిటి నాలకించి యుంటిని. కాని నీవు నారహస్యప్రాకారము నట్లు భేదించితివో నారహస్యసమాచారము నట్లు గ్రహించితివో ఆసంగతిమాత్రము నా కింకను బోధపడలేదు. కాని ఖరోజాబీబీయింటిని గనుపెట్టఁగలిగిన నీవు నారహస్యనివాసమునుగూడఁ గనుపెట్టఁ గలవని నేను నిశ్చయించుకొని యుంటిని!

నొసఁగినది కాదు. జూలియా ప్రేమించుట యనునది కూడ నెఱుఁగుదు! నీ వొకసారి నావంక నీప్రేమపరిపూర్ణకటాక్షములం బఱగించి చూడఁగలిగినచో, అప్పుడు జూలియా యెట్టి ప్రేమైకసర్వస్వమో, జూలియా యెట్టి లావణ్యైకనిధానమో, జూలియా యెట్టి యాదర్శవిగ్రహమో నిమిషములో నీకు బోధపడఁగలదు. జూలియా యెట్టి స్వర్గసుఖసాగరతరంగముల ప్రియుని నోలలాడింపఁగలదో అప్పుడు నీవు తెలిసికొనఁ గలుగుదువు! జూలియా మనోజ్ఞముఖచుంబన మాత్రమున నెట్టి యలౌకికమైయానందోదయ మగునో అప్పుడు నీకు బోధపడఁ గలదు! జూలియా హృదయమున నీ హృదయముంచి యుండుట యెంతటి యనంతసుఖమో అప్పుడు నీ కవగతము కాఁగలదు!

మనోరమపంజరదధికారమునుండి నీవు నన్ను వంచించితివి. అందుకొఱకే నేను నిన్ను ద్వేషించుచున్నాను! నిన్ను ద్వేషించుచున్నాను. నీభార్యను ద్వేషించుచున్నాను, శచీంద్రుని ద్వేషించుచున్నాను, శ్రీశచంద్రుని ద్వేషించుచున్నాను, మనోరమను ద్వేషించుచున్నాను. ఇంక నిద్దఱు ముగ్గురను ద్వేషించుచున్నాను.

నీవు నన్ను బాగుగ నెఱుంగుదువు! నే నెట్టియభిప్రాయముతో నిట్టియుత్తరములు వ్రాసితినో బాగుగ నాలోచించు కొనుము!

నే నెవ్వరిని ద్వేషింతునో వారు శీఘ్రముగనే మరణింతురు!

నాకోరికఁ దీర్చుకొనుటకుఁ దగినప్రయత్నము నేను సంపూర్ణముగఁ జేసికొనియున్నాను. ఈయుత్తరమునందలి విషయములంగూర్చి నీవు బాగుగ నాలోచించుకొనుచుండుము లేకున్న నీవు తప్పక జమీలియాచే బరాజితుఁడ వయ్యెదవు. నిరంతరము సావధానుఁడవై యుండుము.

నీనారి వైరి,

జమీలియా,

"ఈ యుత్తరములోని సంగతుల నాలోచించుకొనుచుండకున్న నీవు పరాజితుఁడవగుదువు!" అని జమీలియా వ్రాసి యుండెను గదా! జాతుల మారవియే యైనను కపటతంత్రములయందును కపటాలోచనములయందును కపటాచరణములయందును ఆమె పిశాచికంటెను భయంకరమైనది.

దేవేంద్రవిజయుఁడు తనకొంతయు భయపడుట లేదు. తన ప్రేమాస్పదు లగువారి క్షేమాభివర్ధనములు తటస్థించునో [illegible] తొట్రుపడుచుండెను. జమీలియా యెట్టి యెట్టి కష్టములఁ గల్పించునో యెవ్వరికిఁ దెలియును? ఆమె కన్నెవ్వరిపైఁ బడినదో యెట్లు తెలియును? దేవేంద్రవిజయుఁ డాయుత్తరమును దనచేతిలో నుంచుకొని సత్వరముగ గృహాభిముఖుఁడై పోయెను.

దేవేంద్రుని మందిరముయొక్క ద్వారమునొద్ద శ్రీశచంద్రుఁడు నిలువబడి యుండెను. దేవేంద్రుని జూచినతోడనే యాతఁడు

దే: ఆతనితోఁగూడ నామె పోయినదా?

శ్రీశ: లేదు.

దే: పరమేశ్వరా! నేను ధన్యుఁడను!

శ్రీశ: అత్త యాతనితోఁ బోవుటకు సిద్ధముగ నుండఁగా నప్పుడు శచీంద్రుఁడు వచ్చినాఁడు.

దే: సరిగ నప్పటికే వచ్చినాఁడా?

శ్రీశ: ఔను.

దే: మంచిపని జరిగినది. తరువాత?

శ్రీశ: శచీంద్రుఁడు వచ్చిన "నేను జూచి వచ్చెద" నని చెప్పినాఁడు. అత్తగూడ నాతనితోఁ బోవలయు నని చూచినది.

దే: అలాగా? తరువాత?

శ్రీశ: అత్తమాట శచీంద్రుఁడు వినలేదు.

దే: (హర్షముతో) శచీంద్రుఁడు మంచిపని చేసినాఁడు. బుద్ధిమంతుఁడు! తెలివైనపని చేసినాఁడు.

శ్రీశ: నేను ముందుగఁ బోయి చూచి నిన్నుఁ దీసికొని రమ్మని మామ చెప్పినచో నప్పుడు నీకు సమాచార మంపెద నని యత్తతోఁ జెప్పి శచీంద్రుఁడు బయలుదేరినాఁడు. అత్త యాతనిమాటలు వినలేదు. తుద కాతఁ డెట్లో యామెను బోధించి యంగీకరింపఁజేసి వెడలిపోయినాఁడు!

దే: సరే! ఎట్లయిన నేమి? వచ్చినకష్టము వచ్చినట్లే తప్పిపోయినది. నేను వచ్చితి నని మీ యత్తతోఁ జెప్పుము.

శ్రీ: అత్త యెక్కడ నున్నది? ఆమె యింకను నింటికి రాలేదు!

దే: (ఆశ్చర్యముతో) ఇంటికి రాలే దనుచున్నా వేమి?

శ్రీ: లేదు స్వామీ!

దే: ఆమె యెక్కడకుఁ బోయినది?

శ్రీ: మిమ్ములను జూచుటకు.

దే: నన్ను జూచుటకా? కచ్చేరియొద్దనుండి సమాచారము వచ్చువఱకు నామె పోకుండ నుండుట కంగీకరించిన దని నీ విప్పుడే గాదా చెప్పితివి?

శ్రీ: ఔను.

దే: (ఆతురముతో) అట్లయిన మరల నిట్లనుచున్నా వేమి?

శ్రీ: కచ్చేరివాఁడు సమాచార మంపినాఁడు.

దే: ఏమి!

శ్రీ: అతఁ డత్తను దీసికొనిపోవుట కొకమనుష్యుని బంపియున్నాఁడు.

దే: ఎంతసేపైనది?

శ్రీ: ఒకగంట కావచ్చినది.

దే: (తొట్రుపాటుతో) ఆఁ! ఆఁ! తరువాత తరువాత! శీఘ్రా! చెప్పుము, చెప్పుము! త్వరగఁ జెప్పుము. నీకుఁ దెలిసినదంతయు శీఘ్రముగఁ జెప్పుము. ఆవచ్చిన వాఁ డెవ్వఁడు? సమాచారమును దీసికొనివచ్చినవాఁ డెవ్వఁడు?

శ్రీశ : రక్షకభటుఁడు.

దేవేం : ఆబొట్టువెనుకటి కృష్ణసమాచారము మీకుఁ జెప్పుటకు వచ్చినభటుఁడే మరల వచ్చినాఁడా యేమి ?

శ్రీ : ఔను. వాఁడే.

దే : ఆతని నీ వెఱుఁగుదువా ?

శ్రీ : ఎఱుఁగను.

దే : ఆతఁ డెట్లున్నాఁడు ?

శ్రీ : మాసల్నాగపాలె నున్నాఁడు.

దే : ఆతఁడు మరల వచ్చెద నని చెప్పినాఁడా ?

శ్రీ : ఏమి చెప్పినాఁడు ? ఏమియు ననలేదు.

దే : సరే. తరువాత ?

శ్రీ : ఆతఁ డొక చీటిని దీసికొని వచ్చినాఁడు.

దే : తచ్చీటి నీయొద్దనుండెనా ?

శ్రీ : ఔను.

దే : నీ వా చీటిని జూచితివా ?

శ్రీ : అది యిప్పుడు నాయొద్దనే యున్నది.

దే : ఏది ! ఏది ! తెమ్ము చూచెదను !

శ్రీ : ఇదిగో ! తీసికొనుఁడు.

అని శ్రీశుఁడు చీటి నిచ్చెను. దేవేంద్రుఁ డాచీటిని దీసికొని చదివెను. అం దిట్లున్నది !

"అత్తా! ఈచీటి నీ కందినవెంటనే బయలుదేరి రమ్ము! నీకొఱకు గూడుబండి పంపియున్నాను. మామయ్యస్థితి యంత బాగుగ లేదు. శచీంద్రుడు"

౧౦

దేవేంద్రుడు నిశ్చేష్టుడై పోయెను. విస్మయసంశయ క్రోధసంశయము లొక్కసారిగ నాతని హృదయము నాక్రమించుకొనియెను. ఇంతటి సంతాపకరం బగు భయంకరావస్థ నాతండు తనజీవితమునం దెన్నడు ననుభవించి యుండలేదు. అట్లే దేవేంద్రుం డింతసే పాలోచించి "శ్రీశా! నీ వాబండిని జూచితివా?" అని ప్రశ్నించెను.

శ్రీ: చూచితిని. ఆబండి సరిగ మన యింటిగుమ్మము నొద్దకే వచ్చినది.

దే: శచీంద్రుడు పోయి రెండుగంట లైనదా?

శ్రీ: ఔను.

దే: మీయత్త పోయి యొకగంట యైనది కాబోలును!

శ్రీ: అవును.

దే: ఆమె యెక్కడకుబోవలయునో తెలిసికొన్నదా?

శ్రీ: తెలియును.

దే: శచీంద్రునియొద్దకా?

శ్రీ: చిత్తము!

దే: శచీంద్రుఁడు పోవునప్పుడు బండిపైఁ బోయినాఁడా?

శ్రీ: లేదు.

దే: శచీంద్రుని పిలువవచ్చినభటుఁడు తనతోఁగూడ బండిని దీసికొని వచ్చినాఁడా?

శ్రీ: లేదు. బండి యెక్కనే లేదు.

దే: అట్లయినచోఁ బరుగెత్తి పోయినాఁడా?

శ్రీ: మిక్కిలి జాగవలయు నని శచీంద్రుఁడు డొంకత్రోవ వడిగనఁ బోయినాఁడు.

దే: ఆభటుఁడుకూడ నప్పుడే పోయినాఁడా?

శ్రీ: చిత్తము.

దే: అతఁడు శచీంద్రునితోఁ గలిసియే పోయినాఁడా?

శ్రీ: లేదు. ఆరక్షకభటుఁడు మఱియొకమార్గమునఁ బోయినాఁడు.

దే: ఆరక్షకభటుని నంబ రెంతయో తెలియునా?

శ్రీ: తెలియును. ముప్పదియైదు.

దే: మరల నీ విప్పు డాతని జూచినచో నానవాలు పట్టఁగలవా?

శ్రీ: ఆ!

దే: అట్లయినచో నీ విప్పుడే ఠాణాకుఁ బొమ్ము! ఇన్‌స్పెక్టరు రామకృష్ణునితో ముప్పదియైదవనంబరు రక్షకభటుని

భటు : ఈరాజోద్యానమునందే.

దే : ఇప్పుడు నీవస్త్రు వేదియైనఁ బోయినదా ?

భటు : పోయినది ! నా డవాలీ పోయినది.

దే : ఎప్పుడు ? ఎట్లు పోయినది ?

భటు : అప్పుడు నేను నిద్రించుచుంటిని. ఒకడు మా యింటికి వచ్చి నా డవాలి నిమ్మని నాభార్య నడిగెను. అందుపై నాభార్య డవాలి యెందుల కని ప్రశ్నించెను. అబ్దుల్ సాహెబు డవాలి మరమ్మతు చేయవలయు నని నాతోఁ జెప్పినాఁడని యాతఁడు చెప్పెను. అయిన నిద్రించుచున్నా రని నాభార్య చెప్పినది. అందుపై నాతఁడు "ఇప్పుడు నాకుఁ బని లేదు. డవాలి బాగుచేసి తీసికొనివచ్చెదను. నే నెత్తికొని పోవువాఁడను గాను. ఈసాయంకాలము దాఁటినచో నాకుఁ జాలఁ బను లున్నవి. డవాలియొకటియే గాదు; మఱి యేపని చేయుటకును నాకుఁ దీరుబడి యుండదు. ఆవశ్యక మైనచో వెదకి తీసికొనివచ్చి యిమ్ము! ఒకటిరెండుగంటలలోఁ దెచ్చి యిచ్చెదను," అని చెప్పెను. అప్పుడు నాభార్య యాతనిమాట నమ్మి నాడవాలి వెదకి తెచ్చి యాతని కిచ్చినది.

దే : ఈనడుమ నీ వెప్పుడైన నీ డవాలిని బాగు చేయవలయు నని చెప్పియుంటివా ?

భటు : చెప్పితిని. కాని యిది మిగుల వింతగా నున్నది.

దే : ఏమి ?

భటు : నేను మేల్కొన్నతరువాత నాభార్య నాకీసంగతి యంతయుఁ జెప్పినది. కొన్నిదినములక్రిందట నొకమేస్త్రీతో నా దవాలి మెఱుఁగు పెట్టియీయవలసిన దని చెప్పియుంటిని. అతఁడే తీసికొనిపోయి యుండు ననుకొంటిని.

దే : మంచిది, తరువాత ?

భటు : నేనప్పుడే యామేస్త్రీయొద్దకుఁ బోయి యడిగితిని. అతఁడు తెల్లపోయెను. అతనికి దవాలిసంగతియే యొకమాత్రమును దెలియ లేదు.

దే : ఎవ్వఁడు వచ్చి నీభార్యయొద్ద నీదవాలిని దీసికొనిపోయెనో యాతఁ డెట్టిపోలికవాఁడో నీ భార్య చెప్పఁగలదా ?

భటు : స్వామీ ! నాభార్య నడిగితిని. ఆమె చెప్పినపోలికనుబట్టి చూడఁగా నేను మొట్టమొదట మాటాడిన మేస్త్రీపోలికవలెనే యున్నది.

దే : ఇప్పుడు నీ వే మని తలంచెదవు ?

భటు : ఏ మనుకొనను ? పదిసంవత్సరములనుండి నేనామేస్త్రీ నెఱుంగుదును. అతఁడు చాల మంచివాఁడు. నాదవాలిసంగతి యొంతమాత్రము నెఱుఁగ నని యాతఁడు ప్రమాణము చేసి చెప్పినాఁడు. అంతటిమంచివానిమాట నే నెట్లు నమ్మకుండఁ గలుగుదును ?

దే : అట్లయినచో నీభార్యయొద్దనుండి నీదవాలి నెవ్వరో మోసగించి తీసికొనిపోయి యుందు రని నీవు భావించుచున్నావా ?

భటు : ఔను. అట్లే యనుకొనుచున్నాను.

౨

అనుసంధానము వెంటనే కావించుటకై దేవేంద్రవిజయుఁడు తగినయేర్పాటులను గావించుచుండెను. శచీంద్రుఁడు వచ్చువఱకు నూరక నిరీక్షించుచుండుటవలన లాభము లేదు. అప్పుడు దేవేంద్రవిజయుఁడు మారువేషము వేసికొని బయలుదేరుటకు సిద్ధముగ నుండఁగా మందిరముఖద్వారము తెఱచిన చప్పుడు వినవచ్చెను. తోడనే చుత్రపదశబ్దముకూడ వినవచ్చెను. ఆయడుగులచప్పుడు శచీంద్రునిదై యుండు నని దేవేంద్రుఁడు తలంచెను. అంతలో శచీంద్రుఁడు సోపానారోహణము గావించి మేడమీఁదికి వచ్చెను. దేవేంద్రవిజయుఁ డాతని రెండుచేతులను బట్టుకొని తనపడకటింటికిఁ దీసికొనిపోయి "శచీంద్రా! ఏమైనది?" అని యడిగెను.

శచీం : నే నింతవఱకును నిశ్చేష్టుఁడనై పడియుంటిని. ఎవ్వఁడో వెనుకప్రాటున వచ్చి నన్నుఁ గఱ్ఱతోఁ బలవంతముగ గొట్టినాఁడు.

దే : ఎప్పుడు! ఎక్కడ?

శచీం : పద్మపురరాజమార్గమును వదలి జైలుపురమునకుఁ బోవునందునఁ బోవుచుండఁగాఁ గొట్టినాఁడు.

దే : దెబ్బ యెక్కడఁ దగిలినది?

శచీం : తలమీఁద.

దే : కొట్టినవాఁ డెవ్వఁడో తెలిసినదా?

శచీం : నే నాతని జూడ లేదు. ఆతఁడు మసల్మానుల వలె నున్న ట్లక్కడ నున్నవారు నాతోఁ జెప్పినారు.

దే : వాఁడు పాఱిపోయినాఁడా ?

శచీం : అవును

దే : దెబ్బ యెచ్చటఁ దగిలినదో చూపుము. తల పగిలిపోలేదు గద ?

శచీం : లేదు. పైని చర్మముమాత్రము కొట్టుకొనిపోయినది. గాయమునుండి రక్తము వచ్చుచున్నది. అంత భయంకరమైనగాయము కాదు. డాక్టరు పరేశేంద్రలాలు వైద్యశాలయొద్దనే పడిపోయితిని. అప్పు డాతఁ డచ్చటనే యుండుటచే నన్ను దీసికొనిపోయి గాయముపై మందువైచి రక్తము స్రవింపకుండఁ గట్టు గట్టినాఁడు. ఏమైన నేమి? అత్తను సమాధానపఱచుటకై నే నట్టు పోయితిని. అత్త యెక్కడ నున్నది!

దే : లేదు. ఆమె మందిరమున లేదు.

శచీం : అది యేమి ?

దే : ఆమెనానగాంగ్రము వారల నొకని బంపినారు. నీపేరితో చీటిని సృష్టించి పంపినారు

శచీం : అలాగా ? ఇట్లయినచో మాయత్త జమీలాలి యా చేతులలోఁ బడిపోయినదా యేమి ?

దే : జమీలాలి యూ కాక మఱి యెవ్వ రింతటిసాహసకార్యమును జేయఁగలుగుదురు ? అంతటి ధైర్యము మఱి యెవ్వరి

న్నిట్టి యాయత్నము నుండిఁగూడదు. నీవు నన్నుఁ జూడఁదలఁచి నచో మారుమాట చెప్పకుండ నే నెక్కడకు తీసికొనిపోయిన నక్కడకు నాతో రావలయును. నీ కిష్ట మున్నచో నీస్త్రీయొక్క భార్యను నిర్బంధమునుండి తప్పింపవలయు నని నీకుఁ గోరిక యున్నచో నీవు నాకొక్కమాట నీయవలయును. ఒక్కనిముసములో మీా యవలయును. నేను చెప్పినట్లొప్పుకొని యీసంధి నంగీకరింప వలయును.

“నీవు వచ్చునప్పుడు నీతోఁగూడ నెవ్వరినైన నెంటఁ బెట్టుకొని వచ్చినచో నేను నీ కగపడను! ఎంత ప్రయత్నించి నను నీవు నన్ను జూడఁజాలవు! నీవు నన్నుఁ బట్టుకొనుటకుఁ బ్రయత్నించెదవేని, నా కేమైన నష్టము గలిగింపఁ దలఁచెద వేని, అనాథయగు నీభార్య యాతనావస్థను బ్రతికియుం డకుండుటయే కాక, యామె యట్టే బాధపడి బాధపడి తుదకు మరణింపఁగలదు. ఆమెను బ్రతికించుట కితరుల కెవ్వరికిని సామర్థ్యము లేదు. ఒకవేళ నీ వింతలో నన్నుఁ జంపెదవేని నీభార్యకిఁక శరణము లేదు. ఆమె మరణించితీరును. నీవు నన్ను బాగుగ నెఱుఁగుదువు!

“నిన్నిప్పటికి రమ్మని వ్రాసియుంటినో యప్పటికు సరిగ నాసమయమునకు నే నొంటిగనే వచ్చి నిన్నుఁ జూచెదను. అప్పుడు నేను నీతో నేమి చెప్పుదునో యామాటకు నీ వంగీకరింపకున్నచోఁ దరువాత నేమి జరుగునో నీవే తెలిసికొనఁ

గలవు! నేను ప్రమాణము చేసి చెప్పుచున్నాను, ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. నేను నీ జీవితమునందును నెంతమాత్రము నపకారము చేయఁబోను. ఒంటిగాఁ బోవలసివచ్చునని నీవు సందేహింప నక్కఱ లేదు. నాకోరిక నీకుఁ దెలిపినతరువాత నీ వందులకు సమ్మతింపకను, సమ్మతింపకపోయినను నాకు నిమిత్తము లేదు. నీవు స్వేచ్ఛగ నీయింటికిఁ దిరిగిపోవచ్చును. నిన్ను నేను బిలిచినప్పుడు నీ వెట్లుంటివో నీ యిల్లు బయలుదేరినప్పు డెట్లుంటివో నాతో మాటాడునప్పు డెట్లుంటివో యట్లే యెట్టియపాయమును లేకుండ మరల నీవు నీయింటికిఁ బోవునంతవరకు నీ జమీలియా నిన్నేమియును జేయఁ దని నమ్ముము. అంతవఱకు నీ కెట్టియపకారమును జేయదని నిశ్చయముగ నమ్మాటకని నమ్మియుండుము. అట్టిస్థితిలో నీవు వచ్చుచుండఁగా నీయితరశత్రువు లెవ్వరైన నీ కెట్టియపకారమునైనఁ జేయఁదలఁచినచో జమీలియా తనప్రాణములనైన వినియోగించి యెట్టియపాయములఁ బడిపోకుండ నిన్ను రక్షింపఁగలదు!

"ఇట్టిస్థితిలో నున్న నీభార్యను రక్షించుకొనుటకు నీ వొక్కఁడవే సమర్థుఁడవు ఎట్లు రక్షించుకొనఁ గలుగుదువో యాసంగతిమాత్ర మిప్పుడు చెప్పఁజాలను. రాత్రి పండ్రెండు గంటలైనతరువాత నన్ను జూడవచ్చినచో నప్పుడు విస్పష్టముగఁ దెల్పెదను.

నీభార్య యిప్పు డిరువదిరెండు నిలువులనూతిలోఁ బడి యున్నదని జ్ఞప్తియందుంచుకొనుము! జమీలియా."

దే : ఔను. చెప్పితిని.

జా : అట్లయినచో మరల నీకీ పతిభక్తి రోగము కలిగి నది ? నే నిప్పుడే యీ పటమునుండి వెలిపోయెదను. నీవు నన్నే మి చేయఁగలవు ?

దే : బాగుగ నాలోచించుచున్నచో నట్లు చేయఁజాలవు.

జా : ఏమి చేయుదువు ?

దే : ఇక్కడయనుగు జరిగినచో నీతల నగిలిపోదా ?

జా : బుద్ధిహీనుఁడా ! నాతలయా ? నీతల నేమి చేయుదువు ?

దే : తరువాత నేమి ?

జా : నీకుఁ గేవలము మతి తప్పిపోయినట్లే యగుచు న్నది. నన్ను నీవు చంపినచోఁ బ్రియతమురా లగు నీభార్య ను జంపుకొన్నట్లే. తెలిసినదా ?

దే : అయినను నిన్నుఁ జంపక విడువను.

౬

"చంపుము. నీయిష్టము వచ్చినట్లు చేయుము ! నీపాదసాన్నిధ్య ము న నీయొద్ద నిగూఢముగ నున్న నిశితకృపాణాగ్రమున కెదు రుగ హృదయము నుంచితిని ! పొడువుము ! ఏకృపాణమును నెదను వెట్టుకొని తెచ్చితివో దానితో నీజామిలియొక్క వక్షో మధ్యమునఁ బొడువుము ! నిర్దయుఁడ వగు దేవేంద్రా ! కఠినా త్ముఁడ వగు దేవేంద్రా ! అతిలోకమోహనసుందరవక్షోభాగము

దేవేంద్రవిజయుఁడు చలించిపోయెను. ఒక్కసారి యాతని సర్వాంగకములును గంపించిపోయెను. అతని ప్రతిరక్తనాళమునుండియు నభూతపూర్వం బగువిద్యుత్ప్రవాహము తీవ్రవేగముతోఁ బ్రవహించుచున్నట్లుండెను. ఏమి మాటాడుటకును దోఁచకుండుటచే దేవేంద్రవిజయుఁడు శిలాప్రతిమవలె నిలువఁబడిపోయెను.

దేవేంద్రుఁ డట్లు నిశ్శబ్దముగఁ గొయ్యవలె నిలిచియుండుటం జూచి జయపాలుఁడు "ఏమి దేవేంద్రా! ఊరకుంటివేమి? ఆయుధమును బైకిఁ దీయుము! ఇంకను జేగుత్త వేమి? ఓస్! ఇప్పుడు తెలిసినది. నేను భావించి నంతటి నిష్ఠురహృదయుఁడవు కావు. అట్టివాఁడవు ఆయుధము నెందులకుఁ దెచ్చితివి?" అనియెను.

దే : సమయమున కుపయోగించునది.

జ : మంచిది. నీయొద్దనున్న యాయుధమును నా చేతి కీయఁగలవా?

దే : ఈయను.

జ : అట్లయినచో నేను నీతో నేమియును మాటాడను. నీకును నాకును సంధి కుదురదు.

దే : సరే. అంతమాత్రమున నాకు నష్టమే మున్నది?

జ : అట్లయినచో దేవేంద్రా! నీ వింకను నాపై శత్రుత్వమును సాధించెదవా?

దే : నా భార్యజీవితమును రక్షించుట కావశ్యక మైనచో నప్పుడు మందు నుపయోగింపవలయు నని.

జా : ఆవశ్యకము లే దని నేను మొదటనే చెప్పితిని గాదా? ఎంతమాత్రము నావశ్యకము లేదు. నీ భార్యను రక్షించుకొనుటకు నీ కాయుధముతోఁ బని లేదు.

దే : అలా గయినచో నా యౌషధము నుపయోగించుట మాని వైచెదను.

జా : నిశ్చయముగ నట్లు చేయుదువా ?

దే : నిశ్చయముగా.

౨

జా : దేవేంద్రా !, నీతోఁ గూడ నెవ్వరైన వచ్చిరా ?

దే : లేదు. నీ వట్లు వ్రాయుటచే నేనొంటరిగనే రావలసి వచ్చినది.

జా : శచీంద్రకీసంగతు లేమియును దెలియవా ?

దే : ఆదెబ్బతో నాతఁడు మంచముపట్టి యుండుట నీకుఁ దెలిసియే యుండును.

జా : ఔను. తెలియును.

దే : తెలిసియు నిట్లు ప్రశ్నించితి వేల ?

జా : నీ వొంటరిగనే యిచ్చటికి వచ్చియుండు వని నా కంతమాత్రమును నమ్మకము లేక.

దే : అంతటి యవిశ్వాసమునకుఁ గారణ మేమున్నది? నే నొక్కఁడనే వచ్చితిని.

జూ : దేవేంద్రా! నీ వెంతటి యాలోచనపరుఁడ వైనను, నెంతటి బుద్ధిమంతుఁడ వైనను జూలియా నుమాత్రము తప్పించుకొని పోఁజాలవు! జూలియా కన్నుమూసి కన్ను తెఱచునంతలో నీ ప్రాణములు నిలువున నెగసిపోవునట్లు చేయఁగలదు.

దే : నీ కింతటిశక్తియే యున్నచో నీ విప్పుడట్లెందుకుఁ జేయుట లేదు? నీకు నాపై నింత దయ యెందులకు?

జూ : నా కింతమాత్రము నట్టికోరిక లేదు. నే నట్లు చేయఁదలంచుకొన లేదు.

దే : ఊరక కాలవిలంబనము చేయుటవలన నీకే యనర్థకము!

జూ : (నవ్వుచు) దేవేంద్రా! బెదరించుచున్నావా?

దే : జూలియా! ఇటు వినుము. నట్టిమాటలతో నా కాలము నేల వ్యర్థము చేసెదవు? నీవు న న్నొక్కడకో తీసికొనిపోయెద నని వ్రాసితివి కాదా?

జూ : అవును.

దే : ఎక్కడకు?

జూ : ఎక్కడకో కాదు. అదిగో ఆ రెండంతస్తుల మేడ యగపడుచున్నదా? అలోపల నొకచోట నీ ప్రియురాలు రేవతి యున్నది. చూచెదవా?

శచీంద్రుఁ డావంకకుఁ బోవుటకై యొకయడుగు ముందటికి వైచెను. అంతలో నెవ్వరో యచ్చటకు వచ్చుచున్న ట్లాతని కగపడియెను. శచీంద్రుఁ డతిత్వరితముగఁ దనవిశీర్ణమలిన వస్త్రములను జెట్టుక్రిందఁ బరచుకొని పరుండి కృత్రిమనిద్రాభినయముం గావించుచుండెను. అప్పటి యాతనినాసికాస్వరంబున నానిశ్శబ్దోద్యానవృక్షంబుల నిద్రించుచున్న పక్షు లన్నియును నిమిషములో నదరిపడి కూయ నారంభించెను.

ఆగంతకుఁడు శచీంద్రునియొద్దకే వచ్చుచుండెను. అతఁ డతివేగముగ వచ్చి శచీంద్రుని వీఁపుపై బలముగ నొక్కగుద్దు గుద్దెను. శచీంద్రుఁడు నిమీలితనయనములతో నీప్రక్కనుండి యాప్రక్కకు నొత్తిగిలెను. మరల నొక్కగుద్దు. అప్పుడు భిక్షుకవేషి యగు శచీంద్రుఁడు నిమీలితనయనముల తోడనే "ఇది యేమయ్యా? మాకుఁ ద్రోవ యొసఁగుట లేదా? అనియెను.

మరల నింకొకగుద్దు. ఆశబ్దము మొదటిరెంటికంటెను నుచ్చైస్స్వరమున వినవచ్చెను. అప్పుడు శచీంద్రుఁడు "ఏమయ్యా! నీవు రక్షకభటుఁడవా యేమి?" అనియెను.

ఆగం : నేను రక్షకభటుఁడను గాను.

శచీం : మఱి యెవ్వరయ్యా? ఉపవనదేవతవా యేమి? నేను దరిద్రుఁడను. ఒకప్రక్కను బడి పరుండియుంటిని. లేవఁగొట్టుట యెందులకు? పెద్దమనుష్యుల నిద్రాభంగము చేయుట నీకుఁ బుణ్యమా? పాతకమా?

దలును వెంటఁబడి యల్లరి చేయుచుండు. ఇంత యొంటరిగ నయ్యా! సెలవు తీసుకొనియెదను. బ్రాహ్మణుఁడ వైనచో నీకు నమస్కారము !

ఆగం : నీ వెక్కడకుఁ బోయెదవు ?

శచీం : కల్లుపాము దర్శనమునకు

అని శచీంద్రుఁ డటనుండి వెడలి పోయెను. ఆగంతకుఁడు మరియొక వైపునకుఁ బోయెను.

మరలఁ గొంత సేపటికి తిరుపతి నాయుద్యానమున రెండవ వైపునఁ గలిసికొనిరి. అప్పు డాగంతకుఁడు "ఏమీ! కల్లుపాముయొద్ద కింకను బోలేదా ?" అని యడిగెను.

శచీంద్రుఁడు విస్మితుడై "ఔను, నే నక్కడ బోవుచుండగా మరల నీ వగపడితి వేమి ? తిరిగి, తిరిగి మరల నీయొద్దకే వచ్చుచుంటి నని పట్టి చూడఁగా నీభూమి గుండ్రముగ నుండుటయే యిది నాకిప్పుడు నిశ్చయముగ బోధపడినది. అట్లు కానిచో నేను తిన్నగ పోవుచు నడచివచ్చుచున్నను నీయొద్దకే వచ్చుట యెట్లు తటస్థించును ? అయ్యా! వచ్చుచున్నాను, నమస్కారము!" అనియెను.

ఆనంతర మాయుద్యానము నుండి పొలములకుఁ బోవు మార్గము ననుసరించి శచీంద్రుఁడు వెడలిపోయెను. ఆగంతకుఁడు తీవ్రదృష్టితో నాతఁ డగపడుచున్నంతవఱకుఁ జూచి తనలో "భయము లేదు. ఇతనివలన నెట్టి భయకారణమును లేదు. నట్టి త్రాగుఁబోతు ! అందుపైఁ బిచ్చివానివలెఁ గూడ నున్నాఁడు

ను. నే నిదివఱకే యెఱిఁగియుంటిని. ఇక్కడిప్పుడు నేమి జరుగుచు న్నదో చూడవలయును" అని యనుకొని జాములా దేవేంద్రుఁడు పోయినదారి ననుసరించి వెడలిపోయెను. ఆ యాగంతకుఁడు జాఱిలి యాగూఢచారుఁడు.

భిక్షుకవేషధారి యగుశచీంద్రుఁడు మార్గమునఁ బోలే దు. ఆ యాగంతకుఁడు దృష్టిపథము నతిక్రమించునంతవఱకు నొకచెట్టుచాటున దాఁగియుండి పిమ్మట నతిజాగరూకతతో నటనుండి వెడలివడి మెల్ల మెల్లగ నాగంతకుఁడు పోయినమార్గ మునుబట్టియే బయలుదేరెను.

శచీంద్రుఁ డట్లు పోవుచుండఁగా మాటిమాటికి నాతని చేతికఱ్ఱ క్రిందఁ బడిపోవుచుండెను. అతఁడు మరల మరలఁ దన కఱ్ఱను దీసికొనుచు నానందముతో నవ్వుచు నామార్గమునఁ బోవుచుండెను.

శచీంద్రుఁడు పడిపోయినకఱ్ఱను గ్రిందనుండి తీసికొను నెడంబున దేవేంద్రుఁ డామార్గమునఁ బోవునపుడు చల్లిన ధాన్య పుగింజలగుర్తులను గనిపెట్టి చూచుకొనుచుండెను. అతనినవ్వు నకుఁ గారణ మదే. ఆగుర్తులనుబట్టియే యాతఁడు పోవలసిన మార్గమును దెలిసికొనుచుఁ బోవుచుండెను.

# తృతీయ ఖండము

౧

అతిత్వరితముగ జమీలాలితాయును, నామెతోఁగూడ దేవేంద్రప్రవిజయుఁడును పోయి యసంస్కృతంబును, నంధకారబంధురంబును, నతినిగూఢంబును నగునామందిరద్వారమునొద్ద నిలువఁబడిరి. అప్పుడు జమీలాలితా « దేవేంద్రా! ఈయింటిలోనికి నీవు నాతోఁగూడ రావలయును » అనియెను.

దే : మంచిది. అలాగే కానిమ్ము!

జ : రేవతి యీమందిరమునందే యున్నది.

దే : సరే. నన్నామెయొద్దకుఁ దీసికొని పొమ్ము.

జ : ఇప్పుడు కాదు. సమయము వచ్చినప్పుడు తీసికొని పోయెదను. ఇప్పుడు ముందుగ నీతోఁ గొన్నిమాటలాడవలయును.

ఇరువురు నాగృహమధ్యమునఁ బ్రవేశించిరి. అంధకారమయం బగుగృహాంగణమునఁ జేరునప్పుడే దేవేంద్రుఁడు వస్త్రాభ్యంతరమున గుప్తముగ నుంచి తెచ్చినపిస్తోలును బైకిఁదీసెను, నలుదెసలను వెలుఁగు దోఁచెను. అకస్మికముగఁ జూచి జమీలాలితా ఉలికిపడియెను. కాని యేమియు మాటాడలేదు.

అనంతర మాయిద్దరు నాయింటికి ఉత్తరమున నున్నసో పానముల నారోహించి రెండవయంతస్తునకుఁ బోయి యచట నున్న గదియందుఁ బ్రవేశించిరి. అప్పుడు జాపిరాలి యా గదియం దొకమూలఁ గొవ్వువత్తి వెలిఁగించెను. అట్లు వెలిఁగించుచునే యామె దేవేంద్రునిఁ జూచి " దేవేంద్రా! నిన్నిచ్చటికెందులకుఁ దీసికొనివచ్చితినో తెలిసినదా? " అనియెను.

దే : తెలియలేదు.

జా : నీ వెఱుంగుదువు. నేను నిన్నెటులైనఁ జంపెద నని ప్రతిజ్ఞ చేసితిని గాదా?

దే : అవును.

జా : కేవలము నిన్నొక్కనినే కాదు. నీతోఁ గలసి యున్నవారి నందఱను గూడఁ జంపెద నని.

దే : ఆసంగతియును దెలిసినది.

జా : నేను ప్రతిజ్ఞ చెల్లించుకొందు నని నీకు నమ్మకమున్నదా?

దే : శక్తి యున్నచోఁ జెల్లించికొనవచ్చును!

జా : అంత సామర్థ్య మున్నది.

దే : ఉన్నచో నిఁక నేమి?

జా : కాని నా కిప్పు డట్టికోరిక లేదు. నేను నీతో నొక యేర్పాటు చేసికొనవలయు నని చూచుచున్నాను.

దే : అలాగా! ఏవిషయమున?

ఱించుచుందువు. అట్టిరక్కసిని నీవు తలఁచుకొన్నచో దేవీమూర్తిగఁ జేయఁగలుగుదువు.

దే: జాబిలా! ఈనీమాట లన్నిటికిని నర్థమేమి?

జా: దేవేంద్రా! ప్రత్యుత్తర మిమ్ము! నా మాటకు తగిన ప్రత్యుత్తర మిమ్ము! సరిగఁ జూచి చెప్పుము. నేను పరమసుందరీమణిని గానా?

అని పలుకుచు జాబిలియా మధురమందహాసము చేయుచు మధురమోహనకటాక్షములఁ బ్రసరింపఁజేయుచుండెను.

దే: (విస్మయముతో) జాబిలియా! నీ వతిలోకమోహనసుందరీమణివే యగుదువు కాని యెవ్వరు చెప్పినారు?

జా: ఎట్టి సుందరిని?

దే: నీహృదయమందలి క్రూరత్వము, నీచత్వము, నీముఖమండలమునఁ బ్రతిఫలింపకపోయినచో సాక్షాత్కరించిన మోహినీదేవతగనే యుందువని భావింతును. నీవంటి రమణీయ రమణీమూర్తిని నే నిదివఱ కెన్నఁడు నెచ్చటను జూచియుండ లే దని నిశ్చయముగఁ జెప్పుచున్నాను.

జా: మనోరమకంటెను సుందరినా?

దే: ఔను.

జా: రేవతికంటెనా?

దే: ఆ,

జా: సుందరీమణుల సౌందర్యమును నీవు ప్రేమింతువా?

దే: ప్రశంసింతును !

జు: నాహృదయమునుండి సమస్తపాపకళంకములును వదలిపోయిన వనుకొనుము. అప్పుడు నేను నీమనసువచ్చిన సుందరీమణి నగుదునా దేవేంద్రా!

దే: కావు.

జు: నీహృదయ మింతకుఁ బూర్వ మేయువతియందును ఆసక్తమై యుండలే దనుకొనుము. నీ వెన్నతెను బెండ్లియాడలే దనుకొనుము! నవయౌవనుఁడ వగుచు వాకస్మికముగ నన్నుఁ జూచితి వనుకొనుము! అప్పుడు నీవు నన్నుఁ బ్రేమింతువా దేవేంద్రా!

దే: అప్పటికిని ప్రేమింపను.

ఈవిధముగ మాటలు తెగిపోయెను. జులియహృదయము తీవ్రవేగమునఁ గొట్టుకొనసాగెను. ఆమెనిశ్వాసప్రశ్వాసములు క్రమము దప్పిపోయెను. ఆమె ముఖమండల మొక్కపారిగ నారక్తమై యంతలోనే తెల్లవాఱిపోయెను. జులియ కొంతసేపటికి మనసు కుదుటబఱచుకొని మాటుపడిన కంఠమున మృదుస్వరముతో "దేవేంద్రా! అట్లయినచో నీ వెన్నఁటికిని నన్నుఁ బ్రేమింపవు! ఎన్నఁటికిని ప్రేమింపవు గాదా?" అనియెను.

దే: ప్రేమింపను. ఎట్లును ప్రేమింపను.

జ : దేవేంద్రవిజయా! నా కిప్పుడు ముప్పదియాఱేండ్లు గడచెను. ఈముప్పదియాఱేండ్లలోపలను నన్నెందఱో ప్రేమించియున్నారు. అందఱిలోను నా ప్రేమప్రతిఫలము ననుభవించినవాఁ డొక్కఁడును నా కగపడలేదు. కాని నిన్నుఁ జూచినతోడనే యేది యేమో కాని నాహృదయము కొట్టుకొనిపోవుచుండును. నాధైర్యము చెదరిపోవుచుండును. నీవు నన్నుఁ బ్రేమించుట లేదు. నీకును నాకును బ్రేమకు నెంతదూర మున్నది? నీవు నాకు శత్రుఁడవు. నామశత్రుఁడవు. అయినను నా హృదయకమలము నీచరణకమలముల నాశ్రయించుటకుఁ దన లోఁ దానే వ్యాకులపడుచున్నది! నాయీకోరిక నిరర్థకమైనదని నే నిదివఱకే తెలిసికొని యుంటిని. అందుచేతనే నేను నిన్నుఁ జంపెద నని ప్రతిజ్ఞ చేసితిని. ఇప్పుడు గాకున్న మఱి యొకప్పుడైన మఱలించి యెటో నిన్నుఁ జంపి నాప్రతిజ్ఞ చెల్లించుకొందును. దాని కేమి? ఇప్పుడు నిన్ను నే నందులకుఁ బిలిచితినో తెలిసినదా దేవేంద్రా! నీతో నొక్కయేర్పాటు చేసికొనవలయు నని చూచుచున్నాను.

దే : చెప్పుము.

జ : నీవు నామాట నమ్మెదవా?

దే : నమ్మకుంచో నాకు నష్టము లే దని తోఁచినయెడల సత్యము నమ్మెదను.

జ : నీభార్యను బ్రేమించుచున్నావా?

దే : ఆ.

జు : నీ కామెను రక్షింపవలయు నను కోరిక యున్నదా?

దే : ఉన్నది.

జు : ఆమెను రక్షించుటకు నీవు స్వార్థత్యాగము చేయఁగలవా?

దే : చేయఁగలను.

జు : నీ ప్రేమను త్యజియింపఁగలవా?

దే : నీ మాటలయర్థ మేమో నాకు బోధపడుట లేదు.

జు : నీవు భార్యను పరిత్యజింపఁగలవా?

దే : ఆమెనా పరిత్యజించుట?

జు : అప్పుడు ఆమెనే, నీ భార్యను, నీ ప్రియురాలను, నీ వొక్క సంవత్సరము వఱకు, ఒక సంవత్సరము ఎంతకాలము, కాదు చిరకాలము వఱకు నక్కఱ లేదు. నీ వామెను మనసులోనే భావించుకొనుచుండవచ్చును. కాని కేవల మొక్క సంవత్సరము వఱకు నీవు నీవు నా వాఁడ వగుదువు. ఒక్క యేఁడు గడచినతోడనే నిన్ను విడిచిపెట్టెదను. నీ వప్పుడు నిర్బాధక ముగ నీ భార్యయొద్దకుఁ దిరిగి పోవచ్చును. ఒక్క యేఁడు, కేవల మొక్క యేఁడు. ఆ సంవత్సరము నేను మరణించెదను. అప్పుడు నీవు నిశ్చింతుడవై యుండవచ్చును. నా యంత నేనే మరణించెదను! నీ కప్పుడు నిర్బంధము లేకుండఁ బోవును. అప్పుడు నీవు [illegible] మా హృత్పంజరమునుండి విడివడిన జీవితకాల మంతయు సుఖముగ గడపఁగలుగుదువు.

నే నిప్పుడే నిన్ను రేవతిరోగముఁ దీసికొనిపోవుదును. ఆమె యిప్పుడు శవమువలెఁ బడియున్నది. ఆమెకు మరలఁ జేతన గల్గించు నౌషధమును నీచేతి కిచ్చెదను. నీవే యామెచేఁ ద్రాగింపవచ్చును. క్షణములో నామెకు మరలఁ జైతన్యము గలుగును. ఎప్పటివలె నుండును. నీ వంగీకరింపనిచో నీభార్యకు మరణమే గతి. అందుచేతనే నేను నీయెదుటఁ గన్నీటితో బ్రతిమాలఁబడియున్నాను. ఇంకను నీవు నాయెదుట శిలావిగ్రహమువలె నిలిచియున్నచో నింతలో రేవతి మరణించు నని తెలిసికొనుము! ఈప్రపంచమునకె యెంతటిబుద్ధిమంతుఁడైనను నామెను బ్రతికింపఁజాలఁడు! ఆమెను బ్రతికించు నుపాయము నాకే తెలియును. నీవు శృంఖలములతో నాకాలుసేతులు బంధించినను, కత్తిలో నా స్తంభమునకు నన్నంటఁ గట్టించినను, నాజుట్టునకుఁ బ్రాణమ్రోసి వ్రేలాడఁ గట్టించినను, నాదంతములు నొక్కటొక్కటిగఁ బెరికించినను, నాకర్ణరంధ్రములఁ గరఁగించిన సీసపు ద్రవము పోయించినను, మఱియెన్నివిధముల బాధించినను నా హృదయధైర్యమును మాత్రము నీ వెన్నఁటికిని సడలింపఁజాలవు. నీ విప్పుడు పట్టు వదలినను నేను నీకు లొంగుదానను కాను. క్షణములో నీభార్యను బ్రతికింతును. అంతటితో నాప్రతిజ్ఞ సఫలము కాఁగలదు. అప్పటి నీహృదయమునకు వేదనయు నదుట నాశారీరకబాధ మెంతపాటిది!

నిన్నుఁ బ్రార్థించుచున్నాను. నాకోరికఁ దీర్చుట నీకంతకష్టము కాదు. నే నేఁడా ఒక్కసంవత్సరముమాత్రము

ఈయొక్క సంవత్సరమును నా వాఁడ వగుము. కేవలము నావాఁడవే! తరువాత నీసంసారమున నీవు సుఖింపవచ్చును. నమ్ముకొని చెడవా దేవేంద్రా! ఆమాట నీ వనిన నిమిషమునందే నీరేవతిని రక్షించుకొనఁ గలుగుదువు. నేను నీయెదుట నిలువఁబడి యతిదీనముగ యాచించుచున్నాను. ఒక్క సంవత్సరము మాత్రము. ప్రత్యుత్తరము చెప్పుటకు ముందుగనే బాగుగ భావించుకొని చూచుకొనుము. దేవేంద్రా! బాగుగ నాలోచించి చూచుకొనుము. నామాటకు నేనంతమాత్రమును జవదాఁటుదానను గాను. నేను చేసినప్రమాణమున కెట్టిపరివర్తనమును గలుగదు. సూర్యచంద్రులు గతులు తప్పినను జమీలియా మాట తిరుగ దని యెఱుంగుము!"

అని చెప్పుచు జమీలియా లేచి సజలనయనయై మ్లానవదనయై సుదృఢహృదయయై దేవేంద్రుని యెదుట నిలువఁబడియెను! దేవేంద్రుఁడు కొయ్యవలె నిలువఁబడిపోయెను. అప్పటి యాతనియొ ధైర్యము కొంచెమైనను మొగమునఁ బ్రతిఫలించుట లేదు. జమీలియా మరల "ఏమనియెదవు దేవేంద్రా? అంగీకరించితివా?" అనియెను.

దే : రేవతి యెక్కడ నున్నది?

జ : ఇచ్చటనే యున్నది.

దే : ఆమెయొద్దకు నన్నుఁ దీసికొనిపొమ్ము.

జ : ఎందులకు?

దే: నే నామెను జూచినతరువాతఁ గాని నీ కిట్టి ప్రత్యుత్తరము నీయఁజాలను.

జా: సరే! నేను నిప్పుడే యామెయొద్దకుఁ దీసికొనిపోయెదను.

దే: తీసికొని పొమ్ము.

జా: తరువాత నీవు నామాటకు బదులు చెప్పెదవా?

దే: ఆ.

జా: దేవేంద్రా! నాతోఁగూడ రమ్ము నీ వవశ్యముగ నంగీకరింతువు. నీవు ప్రేమించు నీభార్యం జూచి యామె యవస్థకు మిగులఁబడి యామెను రక్షించుకొనుటకై నాప్రార్థనము నంగీకరింతువు రమ్ము.

జామాలియా దేవేంద్రవిజయుని వెంటఁ బెట్టుకొని పార్శ్వస్థమునం దున్న గదిలోనికిఁ దీసికొనిపోయెను. ఆగదిలో విశీర్ణకంబళము పై రేవతి మృతప్రాయురాలై పడియుండెను. రేవతి ముఖమండలము పీతముఖముంబోలి కళాహీనమై యుండెను. తద్దృశ్యమాత్రముననే దేవేంద్రవిజయుని హృదయాంతరాళమున సర్వాంగప్రకంపనకరం బగు నైరాశ్యభావ మయ్యెను. అట్టియవస్థాపన్న నాతఁ డెన్నఁడు ననుభవించి యుండలేదు. దుస్సహశోకముచే నాతనిప్రాణములు చలించిపోవుచుండెను. ఆతఁడు లోకము నంత పరితపించుచున్నను ధైర్యమాత్రము సుస్థిరమై యుండెను.

అప్పు డాతఁడు తీవ్రదృష్టితో జామిని నొకసారి చూచి క్రోధతీవ్రకఠినగంభీరస్వరముతో "జామీలియా! నాప్రత్యుత్తరము వినుము. నే నంగీకరింపను" అనియెను.

3

"నే నంగీకరింపను" అనుమాట వినఁబడినతోడనే జామీలియా యదరిపడి నిలువునఁ గూలఁబడిపోవలసినదే కాని యామె యంతటి దుస్సహదుఃఖస్వభావమును మనసునందే యడంచుకొని మందహాసము చేయుచు మృదులస్వరముతోఁ "గళవళపడకుము దేవేంద్రా! నిదానించి యాలోచించి చూడవలెను." అని తీవ్రకటాక్షముల నాతని మొగముపైఁ బ్రసరింపఁజేసెను.

దే: ఆలోచించుటకు నవకాశము లేదు.

జా: అట్లయినచో నీ వంగీకరింపవా?

దే: అంగీకరింపను.

జా: దేవేంద్రా! నీ వెంతో తెలివిగలవాఁడ వనుకొంటిని. తెలివిగలవాఁడ వైనచో నీభార్య యిట్టిదురవస్థలో నుండఁగాఁ గన్నులారఁ జూచుచు నీవిధముగఁ బ్రత్యుత్తరమిచ్చెదవా?

దే: అవును.

జా: ఏమి చూచుకొని నీ వింతటి ధైర్యముతో నున్నావో?

దే: నాభార్య కేమియు భయము లేదు; సుఖముగనే

జా : అట్లయినచో నాప్రశ్నకు "అంగీకరింపను" అని తెలుపద సమాధానము ? ఇఁకఁ గాదనుము. నీకును నీభార్యకును కూడ నేనే మృత్యుదేవతను !

దే : జూలియా ! నావలెనే నీవును మనసు త్రిప్పికొనజాలవా ?

జా : నన్నసహ్యించుకొనుచున్నావా ?

దే : తీవ్రముగ.

జా : అయినచో రేవతియును దివ్యముగ నే మరణించును.

దే : మరణించునా ? చంపెదవా ?

జా : నిశ్చయముగఁ జంపెదను.

దే : అట్లయినచో నామెయొక్కతియే మరణింపదు.

జా : హాహాహాహా హాహాహా (నవ్వుచు) నన్ను బెదరించుచున్నావా దేవేంద్రా !

దే : అవును.

జూలియా మరల నవ్వసాగెను. ఆయమయొక్క కరకఠోరహాసము, ఆపైశాచిక తీవ్రాట్టహాసము, నిర్జలదగగనతలంబున బ్రాగమున వజ్రనిపాతగంభీరారావముంబోలి యుండెను. అట్లు నవ్వుచు నవ్వుచు జూలియా "నీవు నన్ను బెదిరింపజాలవు. నీచేతఁ గాదు !" అనియెను.

దే : చేతఁ గాకపోయినను నిప్పుడు నేర్చుకొనియెదను.

జా : ఎట్లు ?

దే ; నెరవేరకపోయినచో నా కార్యము సఫలమగు టెట్లు ?

జూ : నీకార్యమా ?

దే : అవును.

జూ : ఏకార్యము ?

దే : నీ విదివఱకు నాతోఁ జెప్పితివే ! ఆకార్యము !

జూ : నేను నీతో నే మని చెప్పితిని ? చిత్రము ! నీ మాట నా కర్థమగుట లేదు.

దే : ఇంతకుఁ బూర్వము నీవు నాతో నట్టిబాధలనైన సహింతు నని చెప్పుచుఁ గొన్ని బాధల సగ్గడించితివి కాదా ! ఇప్పు డా బాధ లన్నియు నీ వనుభవించుచున్నట్లు చేసెదను. నేను మనుష్యుఁడ నగుమాట యెంతవఱకు మఱచిపోవలయునో యంతవఱకును మఱచిపోయెదను. ఇఁక నీకుఁ దగినట్లు నీయుక్తమున కనుగుణ్యముగ నే నింతటినుండి పిశాచము నగుటకై ప్రయత్నించెదను. నీశరీరమునన్నిటిని వర్ణాలచ్ఛిన్నములుగఁ జేసివైచెదను. అనంతర ఖడ్గనిశితకరవాలముఖంబున నీశిర మొంతయు రక్తరేఖాంకితముగఁ జేయుదును. నీయెదుటను నిన్ను నా రక్తముద్రిల నుంచింతును. దారుణదుర్భావనాప్రవృత్తుంబు అగు నీనయనగోళముల నామూలముగఁ బెకలించెదను.

జూలియా నవ్వుటకుఁ బ్రయత్నించెను, కాని నవ్వు వచ్చుటలేదు.

దేవేంద్రుఁ డింకను దనవాగ్ధోరణి నాఁపలేదు. "ఆత్మహత్య చేసికొనుటకై నీయొద్ద నేనిచ్చిన విషము నంచుకొనియున్నచో దానిని ముందుగనే నీయొద్దనుండి లాగికొనియెదను. నిన్ను ముండితమస్తకముతోడను, వికలితవదనముతోడను, విదళిత నయనములతోడను వికారాకారిణివై యున్న నిన్ను వీథిలో విడిచిపెట్టెదను. నీవుఁ జావువచ్చువరకు బాధపడి చచ్చెదవు"

అర్ధోక్తియందే జమీలియా బిగ్గరగఁ దీవ్రస్వరముతో "నీవా? ఇట్లంతయును జేయువాఁడవు నీవా?" అనియెను.

దే: అవును. నేనే. చెప్పిన ట్లంతయుఁ జేయువాఁడను నేనే.

జ: నీవా దేవేంద్రవిజయా?

దే: ఔను. నేనట్టివాఁడనో యెప్పుడే మఱచిపోయితివా యేమి జమీలియా? ఆదేవేంద్రవిజయుఁడు మరణించినాఁడు. ఇప్పుడా శరీరమున పిశాచ మధిష్ఠించి యున్నది. ఆపిశాచమే నీవు మరణించువఱకు నీకుఁ గ్రొత్త క్రొత్త బాధలను గల్పించుచుండును. ఒక్కదానివెనుక నొక్కటిగ నూతనమార్గముల ననుసరించి నిన్ను హింసించుచుండును.

జ: (క్రోధముతో) బుద్ధిహీనుఁడా! నీవేమనుకొనుచున్నావు? నన్ను బాధలు పెట్టి హింసించువఱకు నూరక చూచుచు నీయొద్దఁ బెద్దమనుష్యునివలె వెఱ్ఱివానివలె నవ్వుచు నూరకుండ నిలిచియుండెద ననుకొనుచున్నావా?

తులలో చేయి సాచుచుండుటం గాంచి దేవేంద్రుడు "జూలియా! జాగ్రత్త! నే నెత్తవలెను, ఎత్తినచో మరల రివాల్వరు నెత్తి నీచేతుల దుత్తునియలుగఁ జేసివైచెదను. జూలియా! ఇది హాస్యోద్దీపక మనోజ్ఞ పరిహసన మనుకొంటివా? కాదు. కాదు పైశాచిక ఘటనా పరిపూర్ణ విషాదాంత నాటకము." అని యదలించెను.

౪

రెండుసారులు పిస్తోలు ప్రేలినచప్పుడు వినవచ్చినంతనే నిర్దిష్ట సంకేతానుసారముగ శచీంద్రుఁడు వచ్చి జూలియావెనుక భాగమున నిశ్శబ్దముగ నిలిచియుండెను. దేవేంద్రవిజయుఁడాతని జూచెను. కాని జూలియామాత్రము చూడలేదు. అతఁడప్పుడు భిక్షుకవేషముతో లేఁడు. ఇంతలో నాతఁడా వేషమును మార్చి పోలీసుదుస్తులను ధరించియుండెను.

దే : జూలియా! "నేను చచ్చినతరువాతఁగూడ నిన్నే యనుసరింతును!" అని యొకప్పుడు నీవు నాతోఁ జెప్పియుంటివి కాదా? అట్లే నేను మరణించినను నీ వెన్నంటియే యుండెదను. భూతమువలెఁ గంటఁబడకుండ నిన్ను వెంబడించుచుండెదను. నీ వెంతమాత్రమును దెలిసికొనఁజాలవు. అప్పుడు నీ చేతులను వెనుకకు విరిచికట్టి పట్టుకొనియెదను. అప్పుడు నీ కొక్కయడుగైనఁ గదలుటకు శక్తియుండదు. తెలిసినదా?

జూ : లేదు.

దే : ఈసారి——

అనుచుండఁగనే వెనుక నున్న శచీంద్రుఁడు జూలి యారెం డుచేతులను వెనుకకు విరిచి పట్టుకొనియెను. జూలియా శక్తి లు వైచుచు బలవంతముగఁ జేతుల వదలించుకొనుటకు ప్రయ త్నించెను; ఎంత చేసినను శచీంద్రునిపట్టు విడిపించుకొనఁజాలక పోయెను.

దే : జూలియా ! నీ విప్పు డసహాయవు ! పారిపోవు టకు నీ కిఁక సహాయము లేదు. ఈసారి నేను నీ కాలుసేతు లను సంకెలలఁ దగిలించెదను. పిమ్మట నింతకుఁ బూర్వము నా కిచ్చినట్లు సకలబాధలను బెట్టి హింసించెదను.

అని చెప్పుచు దేవేంద్రుఁ డామెకాలుసేతులు బంధించి యొకకుర్చీపైఁ గూర్చుండఁజేసి యినుపగొలుసుతో నా కుర్చీ కామెను బంధించివైచెను. అప్పుడు జూలియా శచీంద్రునిఁ జూచెను. ఇంతవఱకును జూడనే లేదు. అప్పు డామె "అయ్యో! ఎంతటి బుద్ధిహీనురాలను ! నా కీసంగతి యింతకుముందు దె లియనే లేదు. !" అనియెను.

శచీం : నేను నీగూఢచారినిఁ బట్టుకొని కాలుసేతులు గట్టి నోట గుడ్డఁ గ్రుక్కి యొకపాదరింటఁ బడద్రోయకుండఁ గ నేవచ్చియున్నచో నీకు నాసంగతి తెలిసికొనియే యుందువు ! ఏమైన నేమి ? జూలియా ! ఇఁక నీపాపప్రాణములు మా దయపై నాధారపడియున్నవి !

దే : అవును జాబాలియా ! నీ వెవ్వనిఁ బ్రేమించితివో ఆకాంతనిదయమీఁదనే నీజీవనము నిలువఁబడియున్నది.

జా : అట్లయినచో దేవేంద్రా ! నీవు నాతో సంధిచేసికొనఁ దలచుట లేదా ?

దే : సంధియా ! యెందులకు ?

జా : నీవు నీ రేవతిని రక్షించుకొనవా ?

దే : శక్తి యున్నచో రక్షించుకొందును.

జా : నీకార్యమును నీవే చెడఁగొట్టుకొనుచుంటి వేమి ?

దే : ఎట్లు ?

జా : నాతో సంధి చేసికొనక—

దే : నీవు రేవతిని రక్షింతు నని చెప్పితివి గాదా ?

జా : ఔను; అప్పటికి నేను నీచేతులలోఁ బడలేదు.

దే : ఆమాట నిజమే. నేను మఱచిపోయితిని. ఆమెకు మరలఁ దెలివి గలిగించు నౌషధమును నీవు నాచేతి కిచ్చెదవా ?

జా : ఇచ్చెదను. నన్ను విడిచిపెట్టుము. నే నిచ్చట నుండి పోయి యౌషధమును దెచ్చి యిచ్చుటకు నాకు నలువది యెనిమిదిగంటల గడు విమ్ము. అట్లయినచో నేను దెచ్చి యిచ్చెదను.

దే : ఇక నటింపఁబని లేదు.

జా : నీభార్యను రక్షించుకొనుటకు నీ కిష్టము లేదు గాఁబోలును.

దే: ఆమె మరణించు నేమో యని నాకు భయము లేదు. నిన్ను బాధించుట కిదియే యారంభము. శచీంద్రా! ఈ బాలతో జామీలి యాకన్నుల నూడఁ బెరుకుము.

జా; (కేకలువైచుచు) చంపకుము, దయతలంచుము.

దే: దయ యెందులకు?

జా: నేను రేవతిని బ్రతికింపఁగలను. బ్రతికించెదను.

దే: బ్రతికింపుము.

జా: నన్ను విడిచిపెట్టుము.

దే: ఆయాశమాత్రము వదలుకొనుము.

జా: నీ విశ్వాసము నామాటలకు సమ్మతించెదవా?

దే: ఎంతమాత్రము సమ్మతింపను.

జా: నే నెంతమాత్రము నామెను బ్రతికింపను. ఆమెను జావనిమ్ము, భస్మమైపోనిమ్ము.

దే: జామీలీయా! నీ వామెను బ్రదికింపుము. ఆమె నిన్ను వదలిపెట్టుట కనుమతించినచోఁ దప్పక నిన్ను వదలివై చెదను. ఆలోచించుకొనుము. నీభవిష్యత్ఫల మామె చేతులలో నున్నది.

జా: రేవతి చేతులలోనా? ఆమె యంగీకరించినచో నన్ను విడిచెదవా? నే నిప్పుడే యామెను బ్రతికించెదను. నే నసత్యము చెప్పుట లేదు. ఆమె నన్ను వదలిపెట్టును.

దే: విడిచిపెట్టును.

జా : అక్కఱ లేదు. అమందునకు ఫలమగపడును.

అప్పుడు దేవేంద్రవిజయుఁడు సవసన్నుడై పడియున్న రేవతిని పారలౌకికశాస్త్రకమును దనతోడపైఁ జేర్చికొనియెను. అప్పుడాతఁ డనుభవించినంతటి పరితాప మాతని జీవితకాలములో నెన్నఁడు ననుభవించియుండలేదు. ఆపరితాప చిహ్నములెంతటివైనను నాతని మొగమునం దగపడుటలేదు. పిమ్మట వాతఁ డాసీసాలోని యెట్టియదొ ద్రవమును రేవతి వదనమునమున నొక్కొక్కటిగ రెండుచుక్కలను బోసెను.

నిమిషముపై నిమిషము గడచిపోవుచుండెను. గృహమంతయును నిశ్శబ్దమైయుండెను. ఎట్టిశబ్దమును లేదు.

గంటసేపయ్యెను. ఆకస్మికముగ రేవతి కన్నులను దెఱచి నిట్టూర్పువిడిచి నలుదెసలఁ జూడనారంభించెను.

౫

రేవతి కన్నులఁ దెఱచి చూచెను. ఆమె విస్మయమునకు మేర లేదు. జమీలియా రేవతికి క్లోరోఫారమ్, నుపయోగించి తీసికొనివచ్చినది. దానిగుణము తగ్గుచున్నకొలఁది మరల మరల నదే యుపయోగించుచుండుటచే రేవతి యింతవఱకు నిస్సంజ్ఞాహీనయై పడియుండెను. ఆమె కన్నులఁ దెఱచినతోడనే తానున్నయిల్లు తన కపరిచితమైనదని తెలిసికొనియెను. ఆమె కన్నులయెదుట దేవేంద్రవిజయుఁడు నిల్చియుండెను. అతనిపార్శ్వమున వ్యాపారదక్షుఁడై శచీంద్రుఁ డుండెను. దూరమున

నుండి వెలుపలకుఁ బోయెదను. నేనుండ నక్కఱ లేదు. నీవ చట నున్నచో జమీలియా లజ్జచే నిన్నుఁ బ్రార్థింపఁజాలదు. నీవైనను బాగుగఁ దర్కవితర్కములు చేయఁజాలవు. కావున మేము వెలుపలకుఁ బోవుటకు ముందుగనే నీకొక్కమాట చెప్పఁదలఁచియున్నది. జాగ్రత! నీ వెంతమాత్రమును జమీలియాను ముట్టుకొనవలదు. ఎంతమాత్రము నామెసమీపమునకుఁ బోవలదు. దూరముననే యుండి యామెమాటలు నాలింపుము.

అని చెప్పి దేవేంద్రవిజయుఁడు శచీంద్రునితోఁగూడ నటనుండి యవ్వలకుఁ బోయి తలుపులు మూసివైచెను. అవల నుండి వారిరువురును నిరీక్షించుచుండిరి.

పదునేను నిమిషము లయ్యెను. ఎట్టిసంభాషణమును లేదు. మరల బదినిమిషములు గడచిపోయెను. ఎట్టిమాటయు వినవచ్చుట లేదు. ఒక్కగోడమాత్ర మడ్డుగా వారు నిలిచియుండిరి. ఏమియును వినఁబడుటలేదు. అప్పుడు దేవేంద్రవిజయుఁ డస్థిర హృదయుఁ డయ్యెను. ఆతఁడు వెలుపలనుండియే బిగ్గరగ "ఇంకను నైదునిమిషములు నిరీక్షించెదను. అంతలో మీసంభాషణము పూర్తికావలయును" అనియెను. దేవేంద్రుఁడు జేబులోని గడియారమును దీసి చూచుచుండెను. మరల నాయైదునిమిషములునుగూడ వట్టి నిశ్శబ్దముగఁ గడచిపోయెను. దేవేంద్రుఁడు సత్వరముగఁ దలుపులను దెరచెను. అతఁ డెం

మూడనో గాని నిలిచినచోట గొయ్యయైపోయెను. నోట మాట వెలువడుట లేదు.

దేవేంద్రుఁ డీతఁడుండు గొన్ని నిముసములక్రిందట నే గదియందు బంధింపఁబడిన జమలను, రేవతిని విడిచివచ్చెనో యాగది యిప్పుడు శూన్యమై యుండెను. రేవతియును లేదు. జమీాలియాయును లేదు. వారియానవాలైనను లేదు.

“ఇది యేమి. కలఁ గనుచున్నానా ?” అని దేవేంద్రుఁడు ఆశ్చర్యోద్వేగముచేఁ దన రెండుచేతులతోడను కన్నులు నులుముకొనుచుండెను. ఇది స్వప్నమా ? అతఁడు జమునల బంధించిన కుర్చీయొద్దకుఁ బోయి చూచెను. జమీాలియాను బంధించిన శృంఖలము లాకుర్చీక్రిందఁ బడి యుండెను. మఱియు నే తాళముతో నవి తీసివేయఁబడినవి.

ఆకుర్చీపై కాగితము పడియుండెను. అం దిట్లున్నది.

“ఎంత చిత్రము ! వింతలో వింత ! మరల నే నప్పటి వలెనే యున్నాను. బుద్ధి లేనియపరాధ పరిశోధకాధ్యక్షా ! నేను మరల స్వతంత్రురాల నైతిని. నీ రేవతి మరల నాచేతుల లోఁ బడినది. ఇఁకఁ జూచుకొనుము ! శక్తి యున్నచో నామెను రక్షించుకొనుము.

అదిగో !

జమీాలియా”

పడియుండెను. కాని యింకను నాతఁడు మరణింప లేదు. దేవేంద్రవిజయుఁడు నిశ్శబ్దముగ వచ్చుటనే నిలువఁబడి నిరీక్షించుచుండెను.

౬

క్రమక్రమముగ నాపురుషునకు చైతన్యము కలిగెను. అప్పుడు దేవేంద్రుఁ డాతనిఁ జూచి "ఓయీ, నే నడిగినమాటలకుఁ బ్రత్యుత్తర మిచ్చెదవా? అట్లు చేయనిచో నీకు నిష్కృతి లేదు. నీ నాలుకఁ జీల్చివైచెదను" అనియెను.

ఆపురుషుఁడు భయకంపితుఁడై "అయ్యా! నన్నేమి యడిగెదరో యడుగుఁడు!" అనియెను.

దే: జమీలియా యెట్లు తప్పించుకొని పోయినది?

పు: నేనే యామెను విడిపించితిని.

దే: ఆమెయొద్ద నొకయువతి యున్నదే. ఆమె యేమియు ననలేదా?

పు: అంతకుముందే వచ్చి నే నామె కగపడకుండ "క్లోరోఫారమ్" నిచ్చి యామె నొకబండిపై నుంచివచ్చితిని.

దే: బండియా! బండి యెక్కడిది?

పు: నేను ముందుగనే తూర్పువీధియం దొకబండి సిద్ధము చేసి యుంచితిని.

దే: అట్లు చేయుమని నీ కాజ్ఞాపించినవా రెవ్వరు?

పు: జమీలియా.

దే : జమీందారిణియే బండి యెందులకుఁ గావలయు నని చెప్పినది.

పు : ఆమె మీతోఁ గలసి యెక్కడకో పోవలె నని యున్నదని పూర్వమె నాతోఁ జెప్పి బండి తీసికొని రమ్మన్నది.

దే : ఆబండిలో నింకను నెవ్వరైన నున్నారా ?

పు : గిరిధారి యనునాబంధుఁ డొకఁ డున్నాఁడు. అతనినే మీతో వచ్చినవాఁడు తోఁటలో బంధించినవాఁడు నే నాతని విడిపించితిని. అనంతరము మీయిప్పటి వ్యాపార మంతయును రహస్యముగ వచ్చి చూచుచుంటిని. సమయము చూచి నాపని నేఁ జేసికొంటిని. ఈపాటికి వా రందఱును వెడలిపోయి యుందురు.

దే : నీ వేల పోలేదు ? ఇంతసేవ చేసినందులకు నీ కిచ్చుట కేమియు లేదా ?

పు : మిమ్ముల నంపుటకు.

దే : నన్నుఁ బంపుటవలన నీ కేమి లాభము ?

పు : మీకుఁ లాభము.

దే : అందువలన నీ కేమున్నది ?

పు : మీలాభమే నాలాభము.

దే : బండి యెక్కడకుఁ బోయినది ?

పు : పండరపూ వైపునకు.

దే : పండరపూలో నెక్కడకు ? ఏయింటికి ?

పు : ఇల్లుసంగతి నాకుఁ దెలియదు. వేలోద్యానమున కవ్వలనైయుండవచ్చును.

దే : వేలోద్యానమున కవ్వల నెంతదూరము ?

పు : ఎంతదూరమా యుండదు. అటనుండి రెండుమూఁడుతోఁటలు దాఁటినతరువాత ప్రాకారోద్యాన మగపడును. అ తోఁటలనే,

దే : అలాగా ? తెలిసినది హరిరామోద్యానము.

పు : అదే.

దే : నా రక్కడ లేనిచో ? నీమాట లసత్యమైనచో ? నేను నిన్ను—

మాట ముగియకుండఁగనే యాపురుషుఁడు "నే నసత్యము చెప్పుట లేదు" అనియెను.

దే : నీకును నీబంధువులకును జమీలియాతో నెంతకాలమునుండి పరిచయము మున్నది ?

పు : వారము దినములనుండి.

దే : ఆయుద్యానమునం దింక నెవ్వరైన నుందురా ?

పు : ద్వారరక్షకుఁడు మాత్రము. అతనిపేరు పాఁడే సింగు.

దే : వారు పోయి యెంతసే పైనది. ?

పు : నేను రివాల్వరుకాల్చినప్పటి కించుకముందు.

దే : నన్నుఁ జంపినచో నీ కేమి వచ్చును ? చంపుటకు కారణ మేమి ? అందువలన జమల కేమి లాభము ?

బడియెను. తరువాత నాయుద్యానమధ్యమునఁ బ్రవేశించి పశ్చి మాభిముఖుఁడై పోయెను. కొంతదూరము పోవునప్పటి కొక ప్రక్క రెండంతస్తులమేడ యగపడియెను. అతఁ డాలోనఁ బ్రవే శించి యెడమవైపున నున్నసోపానముల నధిరోహించి రెండవ యంతస్తునకుఁ బోయెను. అచ్చట పాహాడ్‌సింగు నిశ్చింతుఁడై హుక్కాపానము గావించుచుండెను. దేవేంద్రవిజయుఁడు నిశ్శబ్ద ముగఁ బోయి యాతనివెనుకవైపుగ నిలిచియుండెను. అతఁడు తీవ్రముగ హుక్కాను బీల్చుచున్న సమయమున దేవేంద్రుఁడు తనచేతులతో నాతనికంఠము బిగిసికొనిపోవునట్లు గట్టిగ నదిమి పట్టుకొనియెను. ఊపిరి యాడకుండుటచే నాతఁడు గోడ్రించు చు నట్లే కొంతసేపటికి యచేతనుఁడై పడిపోయెను. అతనికన్ను లు తిరిగిపోయెను. అప్పుడు దేవేంద్రుఁ డాతనికంఠమును వద లివైచి యాతఁడు కట్టుకొన్న బట్టతోడనే యాతనికాలుసేతులు బంధించి నోట గడ్డలు గ్రుక్కెను. పిమ్మట సత్వరితముగఁ గ్రిందికి దిగియెను.

దేవేంద్రుఁడు మఱియొకమందిరమునఁ బ్రవేశించి చూచెను. అం దెవ్వరును లేరు. ఒకచోటమాత్రము మలినశయ్య యగ పడియెను. ఆయాసముచే దేవేంద్రుఁడు దానిపైఁ బరుండెను. కొంతసేపైనతరువాత పెలుకల బండి నడచుచున్నచప్పు డాత నికి వినవచ్చెను. అప్పుడు దేవేంద్రుఁడు గవాక్షద్వారమును దెఱచి వెన్నెలలోనఁ బరికించెను. ఆబండి తిన్నఁగ నా

గృహద్వారమునొద్దకే వచ్చుచుండెను. ఆబండిలోనే జమాలియు రేవతియు నుందు రని తూతేఁడు నిశ్చయించుకొనియెను. బండి పైఁ గూర్చున్నవాఁడు గిరిధారియే యైయుండు నని యూహిం చుకొనియెను.

ఆబండి క్రమముగ గృహద్వారమునొద్దకు వచ్చి నిలుచఁబడిపోవు ముందుగా గిరిధారి బండిపైనుండి క్రింది కురికెను.

“పహాడ్‌సింగ్! పహాడ్‌సింగ్!” అని జమాలియూ బిగ్గరగ రెండుసారులు పిలిచెను. ప్రత్యుత్తరము రాలేదు. ప్రత్యుత్తర మిచ్చువా రెవ్వ రున్నారు? అప్పుడు గిరిధారి “పాపము! నిర్భాగ్యుఁడా! బుద్ధిహీనుఁడా! దొంగముండకొడుకా! పాపము! ఎక్కడకుఁ బోయితివి?” అని కేకలు వైచి తిట్ట సాగెను.

అప్పుడు జమాలియూ “పోయెమ్మా! అనీషుఁడు గంజాయి త్రాగి యెడతెగకుండ పడిపోయినాఁడు! వానిని జూడ నిమ్మా! గిరిధారీ! నీవు నాచెల్లెలిని దీసికొని పొమ్మా!” అని యెను.

“చెల్లెలా? జమాలియూకుఁ జెల్లెలా?” అని దేవేంద్రుఁడు తనలోఁ దానే మృదులస్వరమున ననుకొనుచుండెను. అప్పు డాతఁ డాపాదమస్తకమును కంపించిపోవుచుండెను.

గిరిధారి బండిలో నున్న రేవతిం జూచి “ఈమె మరణించినదా యేమి?” అని యడిగెను.

మెల్లఁగ జామీాలియా గృహద్వారమునొద్దకు వచ్చి మెల్లఁగ "గిరిధారీ" అని పిలిచెను.

అప్పుడు దేవేంద్రుఁడు ధామ్మని రివాల్వరును ప్రేల్చెను. తీవ్రోజ్జ్వలజ్వాలాపరంపర జామీాలియాకన్నులను మిఱుమిట్లు గొలుపుచు నామెమొగముపైఁ బ్రసరించెను. అప్పుడు కర్కశస్వరముతో దేవేంద్రుఁడు "జామీాలియా! గిరిధారి యిచ్చట లేఁడు. ఇచ్చట నీకొఱకు నేనె నిరీక్షించి యున్నాను" అనియెను.

జామీాలియా నిలువున నీరై యతివిస్మయముతో "దేవేం—ద్ర—వి—జ—యా!" అనియెను.

దే: ఔను. దేవేంద్రవిజయుఁడే నీపాలిటి యముఁడు! నీ శత్రువు, నీపరమశత్రువు. ఒక్కయడుగు కదిపితివో నిన్ను నిలువునఁ గాల్చివైచెదను! జాగ్రత్త! ఇంతకాలమునుండియు నీవు నన్ను నానాబాధలఁ బెట్టితివి. నీమూలముననే నన్నాళ్ళనుండియూ కడుపునిండ నన్నమైనఁ దినుట లేదు. నీకపటతంత్రములఁ భేదించుటలోనే నావిజ్ఞానమంతయు వమ్మైపోయినది. ఇఁక నీకు నిష్కృతి లేదు. దేవేంద్రునిచేతులనుండి నీకింకమాత్రము విముక్తి లేదు. తొందరపడి యడుగు గదిపితివో [illegible] నొందక మానవు.

అని ధిక్కరించుచు దేవేంద్రవిజయుఁడు క్రోధోన్మత్తుఁ డైపోయెను. అతని నయనద్వయమునుండి నగ్నిస్ఫులింగములు బయలు దేరుచుండెను.

జామీలియా భయపడలేదు. ఆమె తనయఖండప్రభా వమును ప్రత్యక్షముగఁ జేసికొని మందహాసము చేయుచు 'ఓరీకి కందా! నన్ను తిరస్కారముతోఁ గాల్చెదవా? దేవేంద్రవిజయా జామీలియానా తిరస్కారముతోఁ గాల్చి చంపుట? చంపజాలవు! నీ కంతటి సామర్థ్యము లేదు. నీచేతులలో మరణించినచో జామీలియా కళంకిని కాదా? నీచేతిలోనా మరణించుట? అయ్యో! అట్లు కాకున్న మరణము రాదా? నాకు మాత్ర స్వప్నమే ఏమ మేలు కావలయును! నే నెవ్వరిఁ బ్రేమించితినో యాతని చేతిలో మరణించుటయా? దుస్సహము! అతిదుస్సహ ము! ఆమరణ మధిక తమదుస్సహ మైనది. దేవేంద్రా! దే వేంద్రా! ఇప్పటికిని చెప్పుచున్నాను. నిన్ను నేను బ్రేమించితి ని. ఇదివరకే ప్రేమించితిని. ఇప్పుడును బ్రేమించుచున్నాను! మరణించినచో మఱచిపోయెదను. ఇఁక నాకా స్మృతియుండదు. ప్రేమింపకపోయినచో నే నెట్టి యాపత్తునఁ బడిపోకయే యుందును. అట్లైనచో నిన్నింతవఱకు నీలోకమునఁ దిరుగనిచ్చియుం దునా? ఎన్ని యుపాయములు తలంచితిని. అట్లు చేయజాలకపోయి తిని. నీముఖము చూచినతోడనే యంతయు మఱచిపోవుచుం టిని. నన్నును, నాకర్తవ్యమును, ప్రపంచమునుగూడ మఱచి

దేవేంద్రవిజయుని కరుణాకల్పవృక్షరూపిణి యగు దాముల యూర్ధ్వ
మున నానావిధములగు పరాభూతమై అంతరించిపోయినది.

ఆసమయమునం దచ్చట దేవేంద్రవిజయుని ముఖమును పరీక్షించినవా రెవ్వరైన నున్నచో నవ్వా డాతనివిశాలనయనములు నిర్నిరీక్షకములుగ గాని శూన్యములుగ గాని లేవని తప్పక ప్రమాణము చేసి చెప్పఁగలిగియుందురు. ఔను, అవ్వా డాతని విస్మయవిస్ఫారిత నయనయుగళము నుండియుఁ జటుకు చిటుకుమని యశ్రుబిందువులు జారుచునేయుండెను!